

తిలకం
చిత్రకారుడు : పైడిరాజు

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." - Dammapada.**

సంపుటి 11 ఫిబ్రవరి 1999 సంచిక 2

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/-

ముఖచిత్రం : **తల్లి బిడ్డలు**

చిత్రకారుడు : పైడిరాజు

---

**Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536**
**e-mail : misimi_m@hotmail.com**
**http : //www.misimi.com**

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# Coping with long-winded speakers

## *LAFFING GAS...*

**- Judson K Cornelius**

The trouble with some public speakers is that they never run out of talk, only out of listeners. They don't know when to speak their mind and when to mind their speech. They go on speaking even when your listening is lessening. Their long-winded speeches make you dumb at one end and numb at the other. To some sensitive listeners they become a constant source of 'earitation'. A nameless wag has well said, "Some public speakers are interesting to the point of departure - and worth escaping from." And rightly, great personalities like Bernard Shaw, Churchill, Lord Birkenhead and many others knew right well how to cope with long-winded speakers.

George Bernard Shaw was once invited to speak at a dinner where the speeches had been far too long and far too many for the patience of the audience. They waited expectantly for Mr Shaw, who was last to speak. When the roar of applause had subsided, "Ladies and gentlemen," he said, "the subject is not exhausted, but we are," and sat down.

Winston Churchill suffered no long-winded bores. A political opponent of Churchill delivered a boring long-winded address in the House of Commons. After an hour Churchill slumped in his seat and closed his eyes. Irritated, the speaker in an angry and loud voice said: "Must you fall asleep when I am speaking?" Without opening his eyes, Churchill replied, "No, it is purely voluntary."

Which brings to mind another famous Englishman, F E Smith, who later became Lord Birkenhead, who was famous for his acidic wit and devilish sense of humour. When he was attending a luncheon in Swansea to mark the opening of the new town hall there, he found him-self sitting next to the Prince of Wales. They both had to sit though a long-winded speech by the Mayor, which seemed never-ending. F E Smith picked up a menu card, wrote a few words on the back, and asked the tostmaster to give it to the speaker. Shortly after he had done this, they Mayor made some very brief closing remarks and sat down.

The Prince of Wales, who had noticed the incident, asked F E Smith what he had written. "Oh, nothing much," Smith replied. "I just told him his fly buttons were undone."

An internationally famous scientist became to irked by a series of bumbling long-winded speakers who preceded him at one banquet that

*Continue Page No. 53*

# తెలుగు చిత్రకళకు వెలుగునిచ్చిన పైడిరాజు

– చలసాని ప్రసాదరావు



భౌతిక ప్రపంచ, లౌకిక జీవన ప్రభావాలకు అతీతంగా కళాజగత్తులో లీనమై, తదాత్మ్యంతో సృజనచేస్తూ జీవించగలగటం కొందరికే సాధ్యం.

అలా పట్టుదలతో పాటుపడి, తానెన్నుకున్న రంగంలో తుది ఘడియల దాకా నిర్విరామ కృషిని కొనసాగించి, నిజమైన కళాకారునిగా నిలబడగలిగిన అపురూప చిత్రకారుడు, అంట్యాకుల పైడిరాజు.

నిజానికి ఆయన తరం (1920-1998) లోని సాంస్కృతిక రంగాల కళాకారులందరూ తమ కళలో లీనమైపోయి, అదే సర్వస్వంగా జీవించిన వారే. అలాంటి వారిలో కొందరు నూతన పథ నిర్దేశకులై తమ తరువాతి తరం వారికేగాక, సమకాలీనులకూ మార్గదర్శకులూగా నిలిచే స్థాయిలో అనుపమాన కృషి చేసినవారు కూడా వున్నారు.

పైడిరాజు చిత్రకారునిగా ఎదిగిన కాలం, కళాకారునిగా జీవించిన కాలం ఒకరకంగా ఆంధ్రచిత్రకళా రంగంలోని అత్యున్నత దశ. జాతీయోద్యమ ప్రభావంతో సమస్త రంగాల్లోనూ స్వీయ ప్రతిభా ప్రదర్శనకు జాతి మేల్కొన్న దశ. ఈ కాలంలో చిత్రకళలో స్వచ్ఛమైన భారతీయత, ప్రాంతీయ జనజీవన సౌరభాలు వెల్లివిరియజేసేందుకూ, కళాకారులు తమ నైపుణ్యాన్ని చూపేందుకు పోటీపడి మరీ నిర్విరామకృషిని కొనసాగించారు. రవీంద్రుని శాంతినికేతన్‌లోని చిత్రకళాశాల, నందలాల్ బోస్, జామినీరాయ్ లాంటి వారికృషి ఇలాంటి వారందరికి ఆదర్శంగా, మార్గదర్శకాలూగా ఉండేవి. అలనాటి మన బందరు ఆంధ్రజాతీయ కళాశాల, మద్రాస్ స్కూల్ ఆఫ్ ఆర్ట్‌లకు నేతృత్వం వహించి, కళాకారులకు ఆధ్యాపకత్వం నెరిపినది బెంగాలీలే. ఫలితంగా పైడిరాజు తరంలోని సీనియర్లు, ఆయన సహాధ్యాయులూ, తరువాతి వారూ అనేకులు కళాసృజనలో తమదైన ప్రత్యేక 'ముద్ర'తో విఖ్యాతులయారు. ఆధునికాంధ్ర చిత్రకళా చరిత్రలో నూతన సృజనకు అదొక స్వర్ణయుగం అనుకోవచ్చు. అంతగా ఆ రంగంలో కృషి అత్యంత వేగంగా విస్తరించింది.

హోతా వెంకటరామగోపాల్, మాధవపెద్ది గోఖలే, కె. శ్రీనివాసులు, పిలకా లక్ష్మీనరశింహమూర్తి, మొక్కపాటి కృష్ణమూర్తి, వి. ఆర్. చిత్రా, ఎస్. ఎన్. చామకూర్, అడివి బాపిరాజు, వేలూరి రాధాకృష్ణ వంటి వారెందరో తమ కళా సృష్టితో కళాభిమానులను ఉర్రూతలూగించిన ప్రతిభావంతులే. వీరికి గురుపీఠం దేవీప్రసాద్ రాయ్ చౌదరి అయినా, ప్రమోద్ కుమార్ ఛటోపాధ్యాయ అయినా, బొంబాయ్ స్కూల్ ఆఫ్ ఆర్ట్ అయినా కళాకారులుగా తమ స్వీయ సృజనావైవిధ్యాన్ని ప్రదర్శించగలగటం విశేషం.

ఈ క్రమంలో పైడిరాజు ఒక ప్రత్యేక ''శైలి'' ని అభివృద్ధి పరుచుకుని, అది తనదీ, తనదే అని అందరూ గుర్తించే సామర్థ్యాన్ని ప్రదర్శించటమేగాదు, అంతకు మించి ఆకర్షవంతంగానూ తీర్చిదిద్దాడా

''శైలి'' అంటే, చూసీ చూడగానే ''ఇది ఫలానా చిత్రకారుడే వేసినట్లుందే...'' అని ప్రేక్షకులు అనుకునేలా చేయగల విశిష్ట లక్షణాలుండే చిత్రణ విధానం. చిత్రణాంశం అందులో భాగమే.

సర్వులకూ సుపరిచితమైన అంట్యాకుల పైడిరాజు ప్రసిద్ధ చిత్రాలలోని అచ్చమైన తెలుగు దనానికి మూలం మన విజయనగర రాజుల కాలపు లేపాక్షి వర్ణ చిత్రాలలో ఉంది. వాటిలోని ప్రత్యేకతలనూ, ఆకర్షణీయ లక్షణాలనూ గ్రహించి, పైడిరాజు తన స్వంత చిత్రణా పద్ధతిని అభివృద్ధి పరుచుకోవటంలో ఉంది. ''దేవాలయానికి''... అని చిత్రం వేసినా, ''పేరంటానికి''... అని వేసినా, అలంకృత మహిళలే అధికంగా ఆక్రమించే వారాయన కాన్వాస్‌ను. వారిని మూర్తీభవించిన తెలుగు దనానికి ప్రతీకలుగా తీర్చి దిద్దాడాయన. కట్టు, బొట్టు, నగలు నిండుగా గుప్పించి చిత్రాల్ని సర్వాలంకార శోభితం చేయటం పైడిరాజు పద్ధతి. ఆయా రూపాలకు ఆలంబనగా ఉండే ఇళ్లు, గుళ్లు, ప్రకృతి అన్నీ అదే శైలిలో రూపొంది కంటికి, మనసుకు ఆహ్లాదాన్ని, తృప్తిని, పదికాలాలపాటు మదిలో మెదిలే రసాస్వాదనను చూపరులకందిస్తాయవి.

ఇవే పైడిరాజును ప్రత్యేకత గల చిత్రకారునిగా నిలబెట్టి సుప్రసిద్ధుడిని చేశాయి. చిత్రకళాశాలా విద్యార్థి దశలోనే గుర్తింపులోకొచ్చి అనేకానేక ప్రదర్శనలలో పాల్గొని బహుమతులూ పొందగలిగాడు. ఏ దేశంలో ప్రదర్శించినా, విదేశీయులిక్కడికి వచ్చినపుడు చూసినా ఆయా చిత్రాల్లోని ప్రాంతీయ సౌరభాన్ని, మన అలంకారశైలిలోని వర్ణవైవిధ్యాన్ని చూసి ముగ్ధులైపోతుండేవారు. ఆఫ్ఘన్ రాజునుండి, భారతీయ గవర్నర్లు, ముఖ్యమంత్రులుదాకా పైడిరాజు చిత్రాల్ని ప్రత్యేకంగా చూసి, స్వంతం చేసుకుంటుండేవారు. ఆ విధంగా పైడిరాజు చిత్రకళలో తెలుగుదనానికి ప్రతీకగా లబ్ధప్రతిష్ఠుడైయాడు.

అందుకు కొనసాగింపులా పైడిరాజు తన 29వ ఏట 1949లో విజయనగరంలో నెలకొల్పిన చిత్ర కళాశాల యువతరం కళాభిమానులకు విద్యాపీఠంగా ప్రసిద్ధమయింది. ఆనాటికి ఆంధ్రదేశంలో బందరు జాతీయ కళాశాల చిత్రకళా విభాగం, రాజమండ్రిలో దామెర్ల రామారావు పేర నెలకొన్న చిత్రకళా శిక్షణా కేంద్రం తరువాత పైడిరాజుదే అలాంటి కళాకేంద్రం. ఆ కళాశాలలో రూపొందిన పైడిరాజు శిష్యపరంపర కూడా ఆయన కుంచె కదలికలలోనే, శైలీ మార్గంలోనే పయనించింది. తెలుగు దేశమంతటా ఏకలవ్య శిష్యులెందరో వెలిసేరు.

అయినా, అందమైన జిరాక్స్ కాపీల్లాంటివెన్ని ఉన్నా అసలు చిత్రం విలువ దానిదే అన్నట్లు పైడిరాజు స్థాయిని అందుకున్న వారెవరూ లేకపోయారు. ఆయన మార్గంలోనే పుంఖాను పుంఖంగా చిత్రాలు రచించిన కళ్యాణ ప్రసాద్ శర్మ కూడా దీటుగా నిలబడలేక పోయేడు.

అయితే, అందరికీ తెలిసిన పైడిరాజు ప్రసిద్ధ చిత్రాలన్నీ ఈ కోవకు చెందినవే కావటం ఒక రకంగా

ఆయనకు సంతోషకరమే కావచ్చు గానీ, ఆయనే అసంఖ్యాకంగా చిత్రించిన మరో రకమైన చిత్రాలే ఆయనలోని కళాకారుని శక్తి, సామర్థ్యాలను ప్రధానంగా ఎత్తి చూపుతాయి. మొదట చెప్పుకున్న అలంకారశోభిత చిత్రాల్ని చిత్రకళా పరిభాషలో ఒకరకంగా ''క్లాసికల్స్'' అనవచ్చును. అవీ కాదన లేని వాస్తవికతా ప్రతిబింబాలే అయినా అతిశయించిన అలంకృత చిత్రాలు. వీటి చిత్రణ, వర్ణలేపనం నిదానంగా, సాంప్రదాయబద్ధంగా చేసేది. ఒక దశకు చేరాక అవి పాతవైపోతున్నట్లనిపించే ప్రమాదముంది. వాటిని నిత్యనూతనంగా, మార్పులు, చేర్పులతో ఆకర్షణ తగ్గకుండా వైవిధ్య ప్రదర్శన చేయటం చాలా కష్టం. అదిలోపిస్తే రానురాను సృజనాత్మకత కొరవడిన మూసచిత్రాల్లా అనుపించనారంభిస్తాయికూడా. ఈ ప్రమాదాన్నధిగమించటం అనేది ఆచిత్రకారుని ప్రతిభ, సామర్థ్యాలకు గీటురాయి వంటిది.

ఈ దృష్ట్యా చూస్తే పైడిరాజులోని అసలైన శక్తి, సామర్థ్యాలు ఆయన అసంఖ్యాకంగా చిత్రించిన నలుపు-తెలుపు చిత్రాల్లోనే మరింత స్ఫుటంగా కనుపిస్తాయి. శక్తిమంతమైన రేఖలు, వేగవంతమైన బ్రష్‌స్ట్రోక్స్, యదార్థ జీవన దృశ్యాలలో రక్త, మాంసాలతో రూపొందిన సజీవ చిత్రాలై ఆకట్టుకుంటాయి.

రంగులలో, రేఖలలో, అలంకారాత్మక దృశ్య రూప చిత్రణలో పైడిరాజు 'శైలి' ఆయనకు ప్రత్యేకమైన గుర్తింపును తెచ్చి పెట్టిన మాట నిజమే! అవి అందరూ మెచ్చిన వర్ణఖండాలనేది చారిత్రక వాస్తవమే. అయినా కూడా కళామర్మం తెలిసిన వారాయనలోని నిజమైన శక్తిని ఆయన వేలాదిగా వేసిన ఇంక్, బ్రష్‌డ్రాయింగ్స్, పెయింటింగ్స్, స్కెచెస్‌లోనే దర్శిస్తారు.

'' ఆనాడు తిరిగానొక వేగ బాండునై....'' అని ''నా మూర్తి చిత్రం'' అనే స్వీయకవితలో రాసుకున్నారు పైడిరాజుగారు. అలా తిరుగుతూ, ఎక్కడి కక్కడ క్షణాల్లో చిత్రించిన అసంఖ్యాకమైన నలుపు, తెలుపు చిత్రాలూ, శ్రీకాకుళం కరువు కాలంలో చిత్రించిన హృదయ విదారక దృశ్యాలూ ఈ కోవకు చెందినవే. ఆంధ్ర ప్రజలనేొక యావద్భారతాన్ని కదిలించిన ఆనాటి యదార్థ సంక్షుభిత జనజీవనం పైడిరాజు కుంచె, పెన్, చార్‌కోల్‌లోంచి వెలువడిన వేగవంతమైన రేఖలలో దయనీయంగా దర్శనమిచ్చి గుండెల్ని పిండుతాయి.

''నేనొక విద్యల నగరం
నేనొక తొమ్మిది ద్వారాల నగరం
నా ముఖమే ఒక రంగస్థలం
నా కంఠం ఒక నాదస్వరం
నా చూపే ఒక చిత్ర పటం
నా మాటే ఒక కవిత్వం
నా శరీరం ఒక కళా కేంద్రం
నా హృదయం ఒక ఆవేశం
నా గీటే ఒక మౌలికం
నా రంగే ఒక లౌకికం

నా చిత్రం ఒక సందేశం
నిలచి ఉన్నానొక గంట స్థంభంలా....''

అని సంతృప్త కళా జీవితం గడిపిన పైడిరాజుగారు రాసుకున్నారో కవితలో. స్వయంగా కవిగాని ఒక కళా కారుని ''గుండెగొంతుక'' లోంచి ''కొట్లాడుతూ'' వచ్చిన కవిత ఇది. అర్థం కన్నా అందులోని ఆర్ద్రత కోసం చూడాల్సిన హృదయ విపంచి ఇది.

నా ఎరికలోని అమాయకుడూ, భోళామనిషీ అయిన పైడిరాజు పుట్టింది డెభ్భై ఎనిమిదేళ్ల క్రితం 1920లో బొబ్బిలిలో. 1940లో మద్రాస్ స్కూల్ ఆఫ్ ఆర్ట్స్‌లో చేరేదాకా గడిపిన రెండు దశాబ్దాల కాలం ఒడిదుడుకులతో కూడిన అన్వేషణాదశ అయినా ఆ తరువాత ఆయన జీవితం, కళాకృషి ఒక దారిన పయనించనారంభించి, ఆ మరుసటేడాదే మద్రాసులో ఆంధ్రమహాసభ నిర్వహించిన చిత్రకళా ప్రదర్శనలో స్వర్ణ పతకం గెలుచుకునేట్లు చేశాయి. ఆ తరువాత ఆయనకన్నీ విజయాలే. అభినందనలే. పురస్కారాలే.

మద్రాసులో చిత్ర కళాభ్యాసానంతరం మరో అయిదేళ్లకు స్వంత పరిసరాలకు చేరి, అక్కడి జనజీవితాన్ని, గ్రామీణ దృశ్యవైవిధ్యాన్ని రేఖా బద్ధం, వర్ణ శోభితం చేస్తూ వచ్చాడాయన.

''వేగబాండు''....గా కాక, కళాకారునిగా, అన్వేషకునిగా దేశంలోని అనేక ప్రాంతాల్ని పర్యటించి అసంఖ్యాక చిత్రాల్ని రూపొందించేడు. ప్రసిద్ధ శిల్పి దేవీ ప్రసాద్ రాయ్ చౌధరి శిష్యునిగా కళాశాల దినాల్లోనే చక్కని శిల్పిగా కూడా అభివృద్ధి చెంది ఉండటాన ఎన్నెన్నో శిల్ప ఖండాల్నీ, వ్యక్తుల రూపశిల్పాల్నీ రూపొందించాడు.

విజయనగరం వంటి రాష్ట్రానికొక మూలనున్నచోట చిత్రకళా పాఠశాలను నెలకొల్పటం సాహసమే అయినా సాధించి, దానిని నిలబెట్టి ఎందరికో శిక్షణ నిచ్చేడు. లలిత కళా అకాడెమీకి ఉపాధ్యక్షుడయ్యాడు. యూనివర్శిటీలు కొన్ని ఆయన సేవలను కోరి స్వంతం చేసుకున్నాయి. ఆంధ్రా యూనివర్శిటీ చిత్రకళా శిక్షణ విభాగాన్ని ప్రారంభించినపుడు పైడిరాజును ఆహ్వానించి అధ్యాపక బాధ్యతల్నప్పగించింది. జర్మనీ, అమెరికా, ఫ్రాన్స్, ఆఫ్ఘనిస్తాన్ వంటి అనేక దేశాలలో ఆయన చిత్రాలు ప్రదర్శితమయాయి. ఆయా దేశాల ఆర్ట్ గ్యాలరీలతో పాటు, భారతదేశంలోని వివిధ చిత్రకళా ప్రదర్శన శాలలలోనూ పైడిరాజు వర్ణ ఖండాలున్నాయి. విడిగా సేకరించుకుని పదిలపర్చుకున్న వారిలో గవర్నర్ల నుండి ముఖ్యమంత్రులదాకా ఎందరెందరో ఉన్నారు.

పైడిరాజు ఒకరకంగా ధన్యజీవి. కష్టపడి కళను సాధించేడు. జీవితాన్ని కళాత్మకం, లయాత్మకం చేసుకున్నాడు. డెబ్భయ్యెనిమిదేళ్ల పరిపూర్ణ జీవితాన్ని వర్ణమయంగా గడిపేడు. అత్యున్నత సత్కారాల్నందుకుని సంతృప్తుడయేడు.

ఒక కళాకారునికి అంతకన్నా కావలసిందేమిటి అనుకుంటూనే, గత డిశంబర్ చివరి వారంలో అజరామరుడయేడు 'కళాప్రపూర్ణ' అంట్యాకుల పైడిరాజు. ★

# 'భయ విశ్వవిషాద మథనం' రచయిత బాధ్యత
## ( 1962 నోబెల్ పురస్కార స్వీకారోపన్యాసం)

జాన్ స్టెయిన్‌బెక్

అనువాదం :

– బి.వి. రామరెడ్డి

జీవితం, రచనలు

సాహిత్యంలో 1962వ సంవత్సరపు నోబెల్ బహుమతి జాన్ స్టెయిన్‌బెక్‌కి ప్రదానం చేయబడింది. స్టెయిన్‌బెక్ కాలిఫోర్నియా రాష్ట్రంలోని సారవంతమైన సలైమాస్ లోయకు దగ్గరగా, పసిఫిక్ తీరంలో ఉన్న చిన్న బస్తీ సలైమాస్‌లో జన్మించాడు. ఈ లోయనే ఆయన తన పుస్తకాల్లో వర్ణించిన సామాన్యమానవుడి జీవితానికి కాన్వాస్‌గా ఉపయోగించుకున్నాడు. ఆయన సామాన్యుడిగానే పెరిగాడు. అయినా తన ప్రాంతంలో నివసించే అతిసామాన్యులతో, వారి కుటుంబాలలో ఒకడిగా జీవించాడు. స్టాన్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో చదివేరోజుల్లో జీవన భృతికోసం లాంచీల్లో పనిచేశాడు. 1925లో డిగ్రీచదువు పూర్తిచేయకుండానే విశ్వవిద్యాలయాన్ని వొదిలేసి ఫ్రీలాన్స్ రచయితగా న్యూయార్క్ వెళ్ళాడు. బ్రతుకు తెరువుకోసం సంవత్సరాలతరబడి అష్టకష్టాలుపడ్డాడు. తరువాత కాలిఫోర్నియాకు తిరిగివచ్చి, సముద్రతీరంలో చిన్న ఇల్లు ఏర్పాటు చేసుకొని రచనా వ్యాసంగాన్ని కొనసాగించాడు.

1935 నాటికే చాలా గ్రంథాలు రచించినా ''టొరిల్లాఫ్లాట్'' అతనికి మంచిపేరుతెచ్చింది. ఈ పుస్తకంలోని కథల్లో తనపాఠకులకు నచ్చిన ఘాటైన హాస్యాన్ని అందించాడు. ఈ కథల్లోని గ్యాంగ్ మెంబర్లంతా సంఘటితమైన వ్యక్తులు. వీళ్ళు పొందే పిచ్చి ఆనందంలో వీళ్ళు కింగ్ ఆర్థర్ రౌండ్ టేబిల్ యోధులకు అపభ్రంశ రూపాలుగా కనిపిస్తారు. ఈ పుస్తకం ఆనాటి అమెరికన్ ప్రజల అసంతృప్తికి విరుగుడు మందుగా పనిచేసింది.

అయితే అలా పాఠకుల్ని ఇబ్బంది పెట్టకుండా ఆనందపరిచే విదూషకుడిగా ఉండడం అతనికి ఇష్టంలేదు. అతను ఎంచుకున్న విషయాలు చాలా తీవ్రమైనవీ, విమర్శనాత్మకమైనవీను. ఉదాహరణకు అతను 1916లో రచించిన '' ఇన్ డ్యూబియస్ బాటిల్'' అనే నవలలో ఆనాటి కాలిఫోర్నియాలోని పండ్లతోటలలోను, ప్రత్తి చేలలోను పనిచేస్తున్న వ్యవసాయకార్మికుల సమ్మెలను వర్ణించాడు. కాలక్రమేణా స్టెయిన్ బెక్ సాహితీ శైలి పదునెక్కింది. 1937లో అతడు వెలువరించిన చిన్న గ్రంథం ''ఆఫ్ మైస్ అండ్ మెన్.'' ఇందులోని లెన్నీ అనే అజ్ఞానరాక్షసుడు ప్రాణులమీద అభిమానంతో తనకు అందుబాటులోకి వచ్చిన అన్నిప్రాణులప్రాణాల్నీ పీల్చివేస్తుంటాడు. 1935లో తన తరువాతి గ్రంథం ''ది లాంగ్ వాలీ'' రచించాడు. ఆ తరువాతి సంవత్సరంలోనే స్టెయిన్‌బెక్‌కు కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిపెట్టిన ''ది గ్రేప్స్ ఆఫ్ రాత్'' రచించాడు. ఈ గ్రంథం ఒకహోమా నుండి అధికార దుర్వినియోగానికిబలై, నిరుద్యోగులుగా, కాలిఫోర్నియాకు వలసవచ్చిన ప్రజలకథ. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో జరిగిన ఈ విషాదసంఘటనలో ఒక వ్యవసాయదారుడు, అతని కుటుంబం మళ్ళీ కొత్తచోటును, కొత్తగూటిని వెదుక్కుంటూ చేసిన హృదయవిదారకమైన ప్రయాణం స్టెయిన్‌బెక్‌ని ఈ గ్రంథం రచించేందుకు ప్రోత్సహించింది.

ఇక్కడ ఇలాగ స్టెయన్‌బెక్ రచనల్ని ఒక్కటొక్కటిగా తీసుకుని విశ్లేషించి చెప్పడం సాధ్యంకాదు. కొందరు విమర్శకులు స్టెయిన్‌బెక్ రచనల్లో పునరుక్తి దోషాన్ని చూపిస్తూ అది స్టెయిన్ బెక్‌లో క్షీణిస్తున్న సాహితీ శక్తులకు ఉదాహరణగా పేర్కొన్నా, స్టెయిన్‌బెక్ 1961లో రచించిన ''ది వింటర్ ఆఫ్ అవర్ డిస్‌కంటెంట్'' ద్వారా వారి విమర్శలను తిప్పికొట్టి తన సృజన శక్తిని నిరూపించుకున్నాడు.

''ది గ్రేప్స్ ఆఫ్ రాత్'' లో ఆయన సాధించిన ఉన్నత శిఖరాలనే ఈ గ్రంథంలోను అందుకున్నాడు. ఆ విధంగా అతడు స్వతంత్రంగా తనదైన సత్యాన్వేషణను - సహజంగా మంచైనా, చెడైనా నిష్పక్షపాతంగా చెప్పే అమెరికన్ తత్వాన్ని చాటుకున్నాడు.

అతడు రచించిన ఈ నవలలోని ముఖ్యపాత్ర ప్రాపంచికాలలో పతనమైన ఒక కుటుంబీకుడు. యుద్ధంలో పనిచేసి వొచ్చాక అతడు అన్నిటిలోను విఫలుడై చివరికి తన తాతముత్తాతలు నివసించిన బస్తీలో ఒక పచారీషాపులో గుమస్తాగా కుదురుకుంటాడు. అతడు నిజాయితీపరుడు. దేన్ని గురించీ కారణం లేకుండా మాట్లాడడు. ఆర్థిక విజయాలను సాధించేందుకు అనువైన అవకాశాలెన్నో అతన్ని ఊరిస్తుంటాయి. అయితే అందుకు అవినీతిమార్గాలను అవలంభించాలి, తన నిజాయితీని బలిచేయాలి. అతని సున్నితమైన అంతరాత్మలో వీటిమధ్య జరిగే అంతస్సంఘర్షణ ఇందులో విశ్లేషించబడింది. అతని అంతరాత్మలో చెలరేగిన ప్రశ్నలు దేశ ప్రగతికి సంబంధించిన సమస్యల్ని గుర్తుచేస్తాయి. ఏ సిద్ధాంతవాదనలూ, అర్థంలేని పరిస్థితుల కల్పనలూ లేకుండా స్టెయిన్ బెక్ తనదైన బలమైన వాస్తవిక ధోరణితో విశదీకరిస్తాడు. శాశ్వత విషయమైన జీవితం మృత్యువు గురించి వివరించేప్పుడు కూడా జీవితంలో ఉండే పగటికలలు, కూలిపోయే ఆశలతో అల్లినా అందులో ఎంతో వాస్తవికత కనిపిస్తుంది.

స్టెయిన్ బెక్ 1962లో రచించిన పుస్తకం ''ట్రావెల్స్ విత్ చార్లీ''. అతడు అమెరికాలోని నలభై రాష్ట్రాలలో మూడునెలల పాటు చేసిన పర్యటన సందర్భంలోని తన అనుభవాల ఆవిష్కారణే ఈ పుస్తకం. ఒక ట్రక్కులో నివేశనాన్ని ఏర్పరుచుకుని, అందులోనే నిత్యావసరానికి సంబంధించిన సరంజామాను అమర్చుకున్నాడు. అతనికి ఈ ప్రయాణంలో అతనికి తోడు ఒక నల్ల కుక్క మాత్రమే. ఈ రచన స్టెయిన్ బెక్ లోని గొప్ప పరిశీలనాశక్తిని చూపుతుంది. ప్రాంతాల పరిశీలనల్లోని సౌందర్యాలను ఇందులో మనం చూస్తాం. ఈ పుస్తకం సమాజం మీద ఎక్కుపెట్టిన బలమైన విమర్శనాస్త్రం కూడా. ఆయన తన ట్రక్కుకు ''రొసినాంట్'' అని పేరుపెట్టాడు. ఇందులో రచయిత కొత్తకంటే పాతకే ప్రాధాన్యత నిచ్చినట్టనిపిస్తుంది. ఒకచోట రచయిత - '' ఆశ్చర్యం! ప్రగతి ఒక్కోసారి నాకు వినాశనంలాగ అనిపిస్తుంది'' అంటాడు. అరణ్యాన్ని నివేశనస్థలంగా మార్చేందుకు, ఆకాశసౌంధాలను నిర్మించేందుకు బుల్డోజర్లు అడవిని కూల్చివేస్తున్న దృశ్యాన్ని కళ్ళారాచూసి అలా అన్నాడు.

నోబెల్ బహుమతిని అందుకున్న ఆధునిక అమెరికన్ సాహితీ వేత్తలు సింక్లెయిర్ లూయిస్ నుండి ఎర్నెస్ట్ హెమింగ్వేదాకా సాహిత్యకారుల్లో అందరికంటే స్టెయిన్‌బెక్ స్వతంత్రంగా, విలక్షణంగా కనుపిస్తాడు. అతనిలోని చేదుహాస్యం అతని కర్కశమైన ఉద్యేశ్యాలను శుద్ధిచేస్తుంది. అతనిది పీడితుల ఎడ ఎప్పుడూ జాలిదృష్టి. తనరచనలలో ఎప్పుడూ డబ్బుకోసం పడే అమానుషమైన తపననీ, జీవితంలోని చిన్న చిన్న ఆనందాలనూ కాంట్రాస్ట్ చేసి చూపుతాడు. అయితే అతనిలోని అమెరికన్ లక్షణాలు ప్రకృతిపై మధురభావన, దున్నిన భూమిపై ఆప్యాయత, చవిటినేల, పర్వతాలు, సముద్ర తీరాలపై ఆత్మీయత మొదలైనవి స్టెయిన్‌బెక్‌కు మానవ ప్రపంచంకంటె ఎక్కువ ఉత్తేజాన్నిచ్చేవి.

స్టెయిన్‌బెక్ సాహిత్యంలో వాస్తవిక ఊహాత్మక రచనల్లోని సానుభూతిదాయకమైన హాస్యం, పదునైన సాంఘిక అవగాహనకు గాను స్వీడిష్ అకాడెమి ఆయనకు నోబెల్ పురస్కారాన్ని ప్రదానం చేస్తున్నట్లు ప్రకటించింది. '' ప్రియమైన స్టెయిన్‌బెక్ గారూ, మీరు మీ అమెరికన్ ప్రజలకు, ప్రపంచ ప్రజానీకానికి

ఎంత పరిచితులో మా స్వీడిష్ ప్రజలకు అంతకన్నా సుపరిచితులు. మీరు మీ సుప్రసిద్ధ రచనలద్వారా మంచినిబోధించారు, మానవతా విలువలను కాపాడారు. అందుకే మీకీ నోబెల్‌పురస్కారం. స్వీడిష్ అకాడెమి మీకు తన శుభాకాంక్షల్ని తెలుపుకుంటున్నది. ఇప్పుడు మిమ్మల్ని ఈ సంవత్సరపునోబెల్ పురస్కారాన్ని మాన్యశ్రీ చక్రవర్తులవారి చేతులమీదుగా స్వీకరించవలసినదిగా కోరుకుంటున్నాను.''
పెండర్స్ ఆస్టర్‌లింగ్, శాశ్వత కార్యదర్శి.

## అంగీకారోపన్యాసం

నా సాహిత్యం ఈ అత్యున్నత పురస్కారానికి అర్హమైనదని నిర్ణయించిన స్వీడిష్ అకాడెమీవారికి

నేను అభిమానించే గౌరవించే ఇతర రచయితలకు కాక నాకే ఈ పురస్కారం లభించినందుకు నాకు కొంత సందేహంగా ఉంది, నా అర్హత గురించి. కాని, ఈ బహుమతి నాకులభించినందుకు సంతృప్తిగాను, గర్వంగాను ఉందనడంలో సందేహంలేదు.

ఈ పురస్కారాన్ని అందుకున్నవారు సాహిత్యాన్ని గురించి వ్యక్తిగతమైన జ్ఞానవంతమైన తమ అభిప్రాయాలను వెలిబుచ్చడం ఆనవాయితీ. ఈ పురస్కారాన్ని అందుకున్న గర్వంతో సింహగర్జనతో తమవృత్తిని గురించి, తరతరాలుగా ఈ మార్గాన్ని సుసంపన్నం చేసినవారి మార్గంలో పయనిస్తున్నవారు మాట్లాడాలి. సాహిత్యం అనేది పాత ప్రార్థనా మందిరాలలో పాస్టర్లుచేసే విమర్శనాత్మక బోధనకాదు, జీవిత ప్రవాహం వొడ్డున కూచుని అసంతృప్తిని కొలుచుకునే వారికోసమూకాదు.

సాహిత్యం భాష అంత ప్రాచీనమైనది. అది మానవావసరంగా ఎదిగింది. అవసరాన్నిబట్టి అదిమారుతూ వొచ్చింది. కవులు, రచయితలు వేరువేరుకాదు. మొదటినుండి వారి విధులు, బాధ్యతలు మానవజాతి చేత నిర్ణయించబడ్డాయి. మానవజాతి విషాదకరమైన గందరగోళ పరిస్థితులలోంచి పయనిస్తోంది. నాకన్నా ముందుగా ఈ గౌరవాన్ని పొందిన విలియం ఫాక్నర్, ఇక్కడ మాట్లాడుతూ, దీన్నే 'భయ విశ్వవిషాదం' అన్నాడు. ఆ భయంవల్ల ఆత్మికసమస్యలు ఉత్పన్నం కాకుండా ఉండేందుకు మానవ హృదయంలోని మధనాన్ని గురించి వ్రాయవలసి ఉంటుంది అన్నాడు. ఆయన చాలామందికంటె మానవశక్తుల్ని, బలహీనతలను గురించి ఎరిగినవాడు, మానవ హృదయంలోని భయగందరగోళాలను అర్థం చేసుకుని వాటిని ఆవిష్కరించడం రచయిత బాధ్యత అని ఆయనకు తెలుసు.

ఇదేమీ కొత్తవిషయం కాదు. ప్రాచీన కాలంనుండి రచయిత బాధ్యత మారలేదు. అతడు మన భయంకరమైన పొరపాట్లను, అపజయాలను, భయానకమైన కలలను మనకు తెలియజెప్పి, మన ప్రగతి మార్గాన్ని బాగుచేసేందుకు బాధ్యతవహించాలి. అంతేగాక, మనిషికి తనలోని హృదయ, ఆత్మోన్నత్యాలను గుర్తించేట్టు చేసేందుకు; తన ఓటమిని అంగీకరించడంలోని ధీరత్వాన్ని, ధైర్యాన్ని, ఆత్మీయతను, ప్రేమను తెలియజేయడం రచయిత ధర్మం.

బలహీనతలమీద, విషాదంమీద అనంతంగా జరిగే పోరాటంలో ఈ ఆశల ఉదాహరణల రంగులజెండాలను ఎగురవేయడం అతనిపని. మనిషిలోని సంపూర్ణత మీద తిరుగులేని విశ్వాసం లేని వాడెవడికీ సాహితీ సదనంలో స్థానంలేదని నానమ్మకం.

బాహ్య ప్రపంచంలో జరుగుతున్న కొన్ని ప్రమాదకరమైన విషయాలు, ప్రగతి కోసం మనం సాధించుకున్న విజ్ఞానం, దాన్ని ఉపయోగించుకునే తీరువల్ల ప్రపంచం భయాందోళనా భరితమైపోయింది. విజ్ఞానంతో బాటుగా మరికొన్నింటిలో మనం ఆదశను అందుకోలేక పోయాం. అంతమాత్రం చేత మనం నిరాశచెందనవసరం లేదు. నిజానికి ఇలాంటి సందర్భాలలో ఆశాదీపాన్ని వెలిగించడమే రచయిత బాధ్యత.

మానవజాతి యుగయుగాలుగా సహజ విరోధులను గర్వంగా ఎదుర్కొంటూనే ఉన్నది. ఒక్కొసారి ఆప్రయత్నంలో ఓటమిని చవిచూసింది. అంతమాత్రం చేత ఇంత బలాన్నుంచుకుని అందుబాటులో ఉన్న విజయాన్ని అందుకునే ప్రయత్నం చెయ్యకపోవడం పిరికితనం అవుతుంది.

నేను ఆల్ఫ్రెడ్ నోబెల్ జీవితాన్ని చదువుకున్నాను. ఆయన్ని గురించి పుస్తకాలు చెప్పేది - అతను ఒంటరి మనిషి, ఆలోచనాపరుడు అని. అతడు ప్రేలుడు పరికరాలను తయారుచేశాడు. అవి మంచీ చేయగలవు, విధ్వంసాన్నీ సృష్టించగలవు. ఎంచుకోవడంలోనే విజ్ఞత. అది అంతరాత్మ నిర్ణయంమీద ఆధారపడి ఉంది.

తాను సృజించిన ప్రేలుడు పరికరాలను రాక్షసకృత్యాలకు వాడుకోవడం నోబెల్ చూశాడు. అవి ముందు ముందు ఎంత సర్వనాశనానికి కారణమౌతాయో గ్రహించాడు. కొందరు ఆయన సినికల్‌గా మారాడని అంటారు. కాని, ఆ మాటను నేను నమ్మను. ఆయన వీటిని నియంత్రించే పరికరాలను కూడా కనుక్కొనేందుకు కృషి చేశాడు. ఆయన చివరికి మానవ మేధస్సులోనే, మానవత్వంలోనే ఆ నియంత్రణశక్తి ఉన్నదని గ్రహించాడు. అందుకే ఆయన ఈ పురస్కారాలను ఏర్పాటుచేశాడని నేననుకుంటున్నాను.

ఈ పురస్కారాలు మనిషి తనను, తన విశ్వాన్ని, పెరుగుతున్న విజ్ఞానంతో తెలుసుకునేందుకు ఉపయోగపడేందుకు ఇవ్వబడుతున్నాయి. సాహిత్య ప్రయోజనం అదేకదా. అన్నింటి సంయోగం ద్వారా శాంతిని సాధించుకోవడం కోసమే ఈ పురస్కారాలు.

నోబెల్ చనిపోయి యాభై సంవత్సరాలు నిండకముందే ప్రకృతిరహస్యాల తలుపులు తెరవబడ్డాయి. మనముందు భయానకమైన ఎంపిక ఉంచబడింది.

పూర్వం భగవంతుడికి ఆపాదించిన ఎన్నో శక్తుల్ని మనం లాక్కున్నాం.

భయంతో, సంసిద్ధులంకాకుండా ఆశక్తులమీది పెత్తనాన్ని మన చేతుల్లోకి తీసుకున్నాం. ప్రపంచంలోని సర్వప్రాణుల జీవనం, మృత్యువుల మీద పెత్తనం చలాయించజూస్తున్నాం. ప్రమాదమూ, ఔన్నత్యమూ - రెండింటికీ సంబంధించిన ఎంపిక చివరికి మనిషిచేతిలో ఉంది. మిగిలిన సంపూర్ణతా కార్యక్రమం అందుబాటులో ఉంది. దేవుడికున్నటువంటి శక్తులను మన చేతుల్లోకి తీసుకున్నాం; బాధ్యతకూడా మనమే తీసుకోవాలి. ఇదివరకయితే ఈ జ్ఞానం కోసం ప్రార్థించాం.

మనిషే మన గొప్ప ప్రమాదం - మన ఆశకూడా!

అందుకేమనం ఈరోజు సెయింట్ జాన్ మాటల్ని గుర్తుచేసుకోవచ్చు:

''అంత్యకాలంలో వాక్యం ఉన్నది. వాక్యం మనిషై ఉన్నది. వాక్యం మనుషులతో ఉన్నది.''

# ఫైర్ వదిలిన పొగ

– మిసిమి వ

"Sex is polymorphus" అన్నాడు ఫ్రాయిడ్. కామాగ్ని చల్లార్చుకోవడానికి - లైంగికంగా తృప్తి పొందడానికి (Sexual gratification) - అనేక రూపాలున్నాయి 'స్త్రీ - పురుష', 'స్త్రీ - స్త్రీ', 'పురుష - పురుష', 'మానవ - జంతు' సంపర్కాల ద్వారా మానవుడు లైంగిక తృప్తిని పొందుతాడు. మామూలుగా సరైన లైంగిక వస్తువు (right sexual object) లభించనప్పుడు, మానసిక అభివిన్యాసాలు వేరుగా ఉన్నప్పుడు, స్త్రీ పురుషులు వివిధ రకాల వస్తువులను ఉపయోగించి లైంగిక తృప్తిని పొందుతారు. స్త్రీలు పురుషాంగాన్ని పోలిన వస్తువులను, పురుషులు స్త్రీ అంగాన్ని పోలిన వస్తువులను ఉపయోగించి తృప్తి పొందుతారు. మార్లిన్ మన్రో లాంటి బొమ్మలను కేవలం కామతృప్తి కోసం తయారు చేసి మార్కెట్‌లో అమ్మడం మనకు తెలుసు, హస్తప్రయోగంతో స్వయం తృప్తి పొందడం చాల సర్వసాధారణ విషయం. అందరికీ తెలుసు కాని ఎవరూ బయటికి చెప్పరు, చెప్పుకోరు.

ఇంకా మనం లైంగిక విపర్యయాలని చెప్పుకొనే పద్ధతులు అనేకం ఉన్నాయి. అంగచూషణం, యోనిచూషణం లాంటివి ఉన్నాయి. బిల్‌క్లింటన్ చుట్టూ వ్యవహారం ఈమధ్య చాలమంది చదివే ఉంటారు.

కొంతమందైతే తమ ప్రేయసుల (ప్రియుల) జేబుగుడ్డలకు, హెర్‌పిన్నులకు, పాదరక్షలకు విపరీతంగా స్పందిస్తారు. అసలు మనిషి లేకపోయినా, వీటికే స్పందించి, తృప్తిపొందుతారు. వీరి విషయంలో అసలు వ్యక్తికంటే ఇవి ముఖ్యాలవుతాయి. ఇవి లేకపోతే వారికి కామతృప్తి ఉండదు. వీటిని "Objects of fetish" అంటారు. ఇవి కాక స్వపీడన (Mosochistic) పరపీడన (Sadistic) కామాలుంటాయి. ఈ చివరివి కొన్ని మానసిక అభివిన్యాసాల కారణంగా రూపుదిద్దుకొంటాయి.

ఈ విపర్యయాలను, కొన్ని రూపాలను మినహాయిస్తే, మిగతా అన్ని లైంగిక రూపాలు సహజాలే. ఒక రూపం సహజమని, మరో రూపం అసహజం అని నిర్ణయించడం ఎలా? శాస్త్రం దృష్టిలో పైన పేర్కొన్న విపర్యయాలు తప్ప మిగతావి అన్ని సహజాలే. అయితే సమాజంలో ఎక్కువమంది మాత్రం ఒక్క రూపాన్నే సహజమని, మిగతారూపాలను అసహజమని చెబుతారు. వారి ప్రకారం సహజరూపం ఏమిటంటే, సంతానోత్పత్తి కోసం స్త్రీ పురుషులు జరిపే అంగాంగ సంయోగం. దీనిని ప్రామాణికంగా చేసుకొని మిగతా రూపాలను (పురుష - పురుష, స్త్రీ - స్త్రీ) అసహజాలంటున్నారు. ఇలా చెప్పడానికి శాస్త్రీయ ఆధారాలేమీ లేవు. శాస్త్రం దృష్టిలో ఆ ఒక్క రూపమే చేసుకొన్న పుణ్యం కాని, మిగతారూపాలు చేసుకొన్న పాపం కాని ఏమీలేదు.

భారతీయ సంస్కృతీ సంప్రదాయాలు ఇటువంటి విషయాలను బహిరంగంగా చర్చించవు సరిగదా, అసలు ఆ వూసే ఎత్తనీయవు. ఇలా కనిపించే భారతీయ సంస్కృతికి చిహ్నాలన దగిన శిల్ప కళా సాహిత్యాలను చూస్తే, పైకి కనిపించేదే సత్యం కాదని తేలుతుంది. గుడులపై గుడ్డలు లేని కామ సూత్ర శిల్పాలను చూసినా, కామ కళాసాహిత్యాన్ని చదివినా, భారతీయ సంస్కృతి నీతి బాహ్యాలని తెగడిన లైంగిక సంపర్క రూపాలెన్నో కనిపిస్తాయి.

ఇంతవరకూ మనం చేసిన చర్చనుబట్టి, ఫైర్ (కామాగ్ని) సినిమాలో ప్రదర్శించిన స్త్రీ - స్త్రీ కామ బంధాన్ని చూసి బాలథాకరే, అతని అనుచరులు గగ్గోలు పెట్టడంలో అర్థంలేదు. వారు లేనిపోని పొగతో నిప్పును (సత్యాన్ని) కప్పివేశారు. వారేదో భారతీయ సంస్కృతికి తామొక్కరే సర్వ

సంరక్షకులమని భావించడం, దాని తరపున వకాల్తా పుచ్చుకొని ఆ సినిమా ప్రదర్శించే సినిమా హాస్‌లను నాశం చేయడం జుగుప్సాకరం. హిందూమతంలో 'సహనం' ఉన్నమాట నిజమైతే, వీరి ప్రవర్తన, ఆ సంస్కృతి పరిరక్షకుల మని చెప్పుకొంటున్న వీరి ప్రవర్తన సంకుచితం అవుతుంది, ఆ సంస్కృతికే వ్యాఘాతం.

అసలు ఫైర్ సినిమాలో ఏముంది? ప్రేమరహితమైన వివాహ బంధంలో ఇరుక్కొన్న ఇద్దరు తోడికోడళ్ళు - స్త్రీ - స్త్రీ సంపర్కంలో సాంత్వనాన్ని పొందుతారు. మంచి ఉత్సాహవంతురాలైన వధువు కుటుంబంలోకి ప్రవేశిస్తుంది. ఆమెసీత. ఆమెకు హిందీ సినిమా పాటల టేపులు పెట్టుకొని వినడం సరదా. ఈమె పెద్దతోడి కోడలు రాధ. ఈమె భర్త మతఛాందసుడు. బ్రహ్మచర్యం ద్వారా నిర్వాణం కోసం ఉబలాట పడుతుంటాడు. వీడియో నడిపే తన నవవరుడు మరొకావిడను ఉంచుకొన్నాడనే విషయం త్వరలోనే తెలుసుకొంటుంది సీత. ఇలా కొట్టుకుపోతున్న తోడికోడళ్ళు, ఔద్వేగిక ఆలంబనం కోసం, ఆ తరవాత శారీరక ప్రేమ (Physical Love) కోసం, పరస్పరం చేరువయ్యారు. తాళం చెవి రంధ్రంలోంచి చూసిన పనిమనిషి ద్వారా విషయం అందరికీ తెలిసిపోతుంది.

ఇందులో థాకరే భీతిల్లవలసింది ఏమీలేదు. ఇంతకంటె పచ్చిబూతు సినిమాలు చాల వచ్చాయి. థాకరేకు పట్టుకొన్న బాధ ఏమిటంటే ''ఈ సినిమాలో ప్రదర్శితమైన 'ఒంటరితనం'. స్త్రీలు తమస్వంతగొంతులను గుర్తించి, వాటికి రంగు, రుచి, వాసనలు కల్పించి, వాటిని అభివ్యక్తం చేయడం'' - ఆయనకు నచ్చలేదు. ఇలా స్వంత గొంతు వినిపించే ఆడవాళ్ళు పితృస్వామ్యానికి - భారతీయ సనాతన విలువలకు - గొడ్డలి పెట్టు అవుతారని ఆయన భయం.

ఇది భారతీయ సినిమా చరిత్రలో ఒక సంక్లిష్టమైన మలుపు - సజాతి లైంగికత (గే, లేదా లెస్బియానిజమ్) లైంగిక విపర్యయం కాదని ముందే చెప్పాం. ఇదే విషయాన్ని ఇటీవల బొంబాయిలో జరిగిన 14వ అంతర్జాతీయ మానవతా - నైతిక సంఘ సమావేశం చర్చించింది. సజాతి లైంగికులు, తామెంచుకున్న రూపంలో లైంగిక తృప్తి పొందేస్వేచ్ఛ, హక్కులు వారికి ఉన్నాయని గుర్తించడం జరిగింది. మానవుడు పూర్తిగా యధార్థీకరణం చెందడం మనిషి(Man) మానవుడు(Human) కావడం, మానవుడు మానవీయుడు (Humane) కావడం - మానవవాదం. ఈ పయనంలో ఆటంకాలన్నీ పరిహరనీయాలే. సజాతి లైంగికులకూ ఇదే వర్తిస్తుంది.

బహుశ, థాకరే శివసేనలు ఇంతగా మండిపడడానికి కారణం భారత సంస్కృతిలో యుగ యుగాలుగా ఆధిపత్యం వహించిన బ్రాహ్మణ పీఠం, 1947లో స్వతంత్రం వచ్చిన తరువాత, అణగారిన అధోజనులు పైకి రావడంతో బీటలువారిపోయింది.

శివసేన వీరవిహారం చేసినా, బిజెపి అణుబాంబులు పేల్చినా, పాకిస్తాన్ క్రికెట్ టీమ్ భారతదేశంలో ఆడడానికి అడ్డుపడాలని చెప్పినా, ఇవన్నీ గూడ కూలిపోతున్న బ్రాహ్మణ పీఠాన్ని నిలబెట్టే ప్రయత్నాల కొనసాగింపే అన్నాడు మహారాష్ట్ర టైమ్స్ సంపాదకుడు కాటేకర్, బొంబాయి హ్యూమనిస్టు కాంగ్రెస్‌లో.

ఏది ఏమైనా జాతి సంస్కృతిని ఏ ఒక్కడూ నిర్దేశించలేడు, నిబద్ధించలేడు. అది నిరతం సాగే ప్రవాహం. ప్రవాహం గతి, దిశ, విలువలను బట్టి దాని శీలం మారుతూ ఉంటుంది. మార్పు అనివార్యం. అనివార్యమైనదానిని, నిరోధించాలనుకోవడం వెర్రితనం.

# కవిత్వము - అలౌకిక సౌందర్యము

- డా॥ యు. ఎ. నరసింహమూర్తి

కిమప్యస్తి స్వభావేన సుందరం వాప్యసుందరమ్!
యదేవ రోచతే యస్మైమతత్తస్య సుందరం భవేత్!!

స్వభావాన్ని బట్టి ఇది సుందరమైనది - ఇది వికారమైనది అని నిర్ణయించదగినది లేదు. ఏది ఎవనికి ఇష్టమౌతుందో అది వానికి అందంగా కనిపిస్తుంది అని పై హితోపదేశ వాక్యం చెప్తూంది. ఈ కారణంగానే సౌందర్యానికి సంబంధించి అనేక వాదాలేర్పడ్డాయి.

సోక్రటీసుకు ముందే ఎక్కువ ఉపయోగిత కలదే ఎక్కువ అందమైనదనే భావం ఏర్పడింది. ప్రాచీన ఈజిప్టు ప్రజలు జీవితమే సౌందర్యమని తలచేవారు. వస్త్వాశ్రయమైన సహజత్వం -

అమరిక - అన్యోన్యత అందంగా భావించారు. ఉనికి - జనన మరణాలు సంఘర్షణ - అన్యోన్యత వంటి విరుద్ధశక్తుల మధ్య ఏర్పడే సంయమనమే సౌందర్యమని హెర్మాక్లిటస్ భావన. పంచభూతాత్మకమైన ప్రకృతిలో పరిణమించిన సమన్వయమే సౌందర్యమని, సంఘర్షణే అందవికారమని ఎంపెడోక్లెస్ భావించాడు. డెమోక్రిటస్ సుఖ వాదంలో సౌందర్యాన్ని చూచాడు. హిప్పియాచ్ అందమైన యువతే సౌందర్యమంటే, సోక్రటీసు బాగా తయారయిన ఒక కుండలో అందంలేదా? అని ప్రశ్నించేడు. లాభకరంగా ఉండటం, ఉపయోగిత, మంచి ఉత్పత్తి సామర్థ్యం కలిగి ఉండడం సౌందర్య లక్షణాలన్న ఆలోచన కూడా వచ్చింది. కాని మంచిదల్లా అందమైనది కావాలని లేదు, అందమైనదల్లా మంచిది కావాలని లేదు అని తేలింది.

శ్రవణ - నయనేంద్రియాలకు సుఖాన్నిచ్చేది సౌందర్యమని సోక్రటీసు ఒక దశలో భావించినా సౌందర్యవాదులు జిహ్వ - త్వక్- ఘ్రాణాలను కూడా వదులుకోలేకపోవడంతో ఇంద్రియ సుఖాన్నిచ్చేదే సౌందర్యమనే వాదం ఒకటి బయల్దేరింది. బౌద్ధిక వ్యాపారానికి చోటులేకపోవడం ఈ వాదంలో లోపంగా కనిపించింది. ఇంద్రియసుఖానికి ఉపయోగితను కూడా కలిపి ''ఉదార ప్రయోజనాలను సాధించే ఉపయోగిత - శక్తిమత్త సౌందర్యమనే తలపు కలిగింది. ఇలా ఇన్నివాదాలు కొనసాగిన తరువాత మొదటగా సౌందర్య వాదంలో అతీంద్రియదృష్టికి, అలౌకిక జ్ఞానానికి స్థానం కల్పించినవాడు ప్లేటో. అరిస్టాటిల్, పైథాగరస్ మతాన్ని కొనసాగిస్తూ సౌందర్యాన్ని వస్త్వాశ్రయంగా భావిస్తూ ప్రమాణము - క్రమము సౌందర్యభావన కలిగిస్తాయన్నాడు.

థామస్ ఆక్వినస్, టెర్టూలియన్ వంటివారు సౌందర్యం దివ్యమని భావించేవారు. ప్రకృతి అందమైనదని, దానిని అనుకరిస్తే కళా సౌందర్యం సిద్ధిస్తుందని లియోనార్డో డవిన్సి, షేక్స్పియర్ వంటివారు భావించారు. ఇంకా కాంట్, హెగెల్, క్రోచే మొదలైన పాశ్చాత్యులెందరో సౌందర్యతత్త్వాన్ని గురించి తరచిచూచారు. ఇందరిని అర్థం చేసుకున్నాక హితోపదేశవాక్యం స్ఫురణకు రాక తప్పదు. ఎందుచేతనంటే ఆధునిక యుగావసరంలో మళ్లీ మార్క్స్ ''శ్రమైక జీవన సౌందర్యానికి సమానమైనది లేనేలేదు'.' అని సిద్ధాంతీకరించాడు.

భారతీయులు వైదికయుగం నుండి అపరిమితత్వం, అనంతత్వం, అక్షయత్వం, అనిర్వచనీయత లక్షణాలుగల సౌందర్యం అలౌకికమని, అతీంద్రియమని, దివ్యమని భావిస్తూ వచ్చారు. పాంచభౌతికము వస్త్వాశ్రయము అయిన దృశ్యజగత్తులో 'ఆనందా భాసమేకాని భాసిత చిదానందంబు రూపొందునే!' అన్నది ఆర్షమైన భారతీయ భావన. దృశ్యజగత్తు సుందరమైనదిగా కనబడవచ్చును. కాని అది ఎంతరమ్యమైనదో అంత జుగుప్సితమైనది కూడా. ఎంత ఉదారమైనదో అంత నీచమైనది కూడా. ఎంత ప్రసన్నమైనదో అంత ఉగ్రమైనది కూడా. రమ్యము, ఉదారము, ప్రసన్నము అయిన దివ్యజగత్తును దర్శించడమే, అలా పర్యవసించడమే, చేరడమే, ఐక్యంకావడమే పార్యంతిక ఫలంగా నిలిచిన సౌందర్యం దివ్యమైంది. దానిని స్పష్టించడమే కళాధర్మం. అందుకే ఋషికానివాడు కవికాలేడని తలచేరు. ఋషులు ద్రష్టలు. అంటే సౌందర్యం ఇంద్రియసుఖసంపాదక మాత్ర పర్యవసాయి కాదు - అదొక బౌద్ధిక వ్యాపారమని తేలింది. ప్రతిభ వ్యుత్పత్తి అభ్యాసాలలో ప్రతిభకు పెద్ద పీట వేయడం ఇందుకే. ప్రతిభ 'కనబడని సత్యం యొక్క కనబడే సత్యాన్ని కవ్విస్తుం' దని 'ప్రతిభ అంటే ఆటంకంగా ఉన్న తెరను తొలగించడం' అని ఆనందకుమారస్వామి గారంటారు. ఈ కనబడనిది లోకములో లేనిది - అంటే అలౌకికము కావచ్చును. దృశ్యజగత్తులో ఉండికూడా నిగూఢమైన రహస్యంగా ఉండవచ్చును. దానిని కవి మనకు చూపిస్తాడు.

దివ్య సౌందర్యంలో ఒక్క బుద్ధికేకాక మనోబుద్ధి, చిత్త అహంకారములతో కూడిన అంతఃకరణప్రవృత్తికి కూడా ప్రమేయముంది. ఈ అంతఃకరణం కారణంగా కవిత్వంలో అనిర్వచనీయత, అతీంద్రియ దర్శనం అనే లక్షణాలు చోటుచేసుకుంటాయి. దీనినే 'మేధకు దూరమైన మనసుకు చేరువైన ఒక ప్రతీతి' అని గుర్తించాడు బైరాగి. ఈ విషయమే ''మనస్తు పరాబుద్ధిః'' అన్న కఠోపనిషత్ వాక్యంలో కనిపిస్తుంది.

ద్రష్టకు జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయావస్థలుంటాయి. జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలలో ఉన్న చైతన్యాన్ని 'మాండుక్యోపనిషత్తు' వైశ్వానరుడు, తేజసుడు, ప్రాజ్ఞుడు అని పేర్కొంది. జాగ్రదవస్థలో అభివ్యక్తమైన విరాట్ప్రపంచం ఉంటుంది. ఇది దైహికస్థితి. స్వప్నావస్థలో అగోచరమైన మనఃప్రపంచముంటుంది. ఇది మానసికస్థితి. సుషుప్త్యవస్థలో మూలకారణమైన ఈశ్వరుడు ఉంటాడు. ఇది బౌద్ధికస్థితి. ఈ స్థితులలో చైతన్యాన్ని క్రమంగా విశ్వుడు - తైజసుడు - ప్రాజ్ఞుడు అంటారు.

ఇందులో అభివ్యక్త ప్రపంచాన్ని గురించి రాసే కవులున్నారు. వారికి ఎక్కువ పరిగణన లేదు. మనః ప్రపంచాన్ని ఆవిష్కరించే స్వాప్నికులైన కవులున్నారు. వారినిబట్టే ముందే ''కావ్యాలా పాంశ్చవర్జయేత్'' అనే మాట పుట్టింది. ప్లేటో వీరినే ఎడంగా పెట్టేడు. ''ప్రజ్ఞావాన్ లభతే విద్యా'' అన్నది ఆర్యోక్తి. విద్య అంటే పరమాత్మజ్ఞానము. ఆవిధమైన ప్రజ్ఞకలవాడు ప్రాజ్ఞుడు. మనః ప్రపంచ సంబంధమైన స్వప్నజగత్తును పారమార్థిక జగత్తుతో సమన్వయపరిస్తే అది సత్కవిత్వమని అంగీకరించారు. అందుకే కావ్యానందం బ్రహ్మానంద సహోదరమని అన్నారు.

కవి ప్రాథమికంగా తైజసుడు. అందుకే సులభంగా అందరినీ ఆకట్టుకోగలడు. స్వప్నావస్థ ప్రపంచంకూడా భావనిర్మితమే అని చెప్తుంది. కవిత కానరాని జగత్తు అని ఎం. జీన్ కొక్టేల్ అన్నారు.

చిదాభాస స్థితా నిద్రా విక్షేపావృత రూపిణీ - ఆవృత్య జీవజగతి పూర్వే నూత్నంతు కల్పయేత్।
ప్రతీతి కాల ఏవైతే స్థితత్వాత్ ప్రాతిభాసికే - నహిస్వప్న ప్రభుద్ధస్య పునః స్వప్నేపి స్థితిస్తయోః॥
అని స్వప్నప్రవృత్తి వివరించబడింది.

నిద్ర తమోరూపమైనది. దానిని అవిద్య అంటారు. ఈ అవిద్య చిదాభాసుణ్ణిలో అంటే వ్యావహారిక జీవునిలో ఉంటుంది. అది ఆవరణశక్తి - విక్షేపశక్తి అనే రెండు రూపాలలో ఉంటుంది. ఆవరణశక్తి ఆ నిద్రలోనే జీవుడికి అంతకుముందు అనుభవంలో ఉన్న జీవ జగత్తులను పునరావృతం చేస్తుంది. ఆ విధంగా ఆవృతములైన జీవజగత్తులతో విక్షేపశక్తి కలలో కొత్త జీవ జగత్తులను సృష్టిస్తుంది. కలలోని ఈ జీవ జగత్తులు నిజమైనవి కావు. ఎందుచేతనంటే కలగనే కాలంలో అవి అనుభవింపబడినట్లు కనబడినా కలలోంచి బయట పడ్డమనిషిలో అవి వుండవు. తిరిగి కలలోకి రమ్మన్నారావు. కలలో అహంకారం అర్థవికాసాన్ని కలిగి ఉంటుంది. జాగారంలో అది సంపూర్ణ వికాసాన్ని కలిగి ఉంటుంది. ఆర్షకవి ఈ రెండింటి సమన్వయంతో కావ్యకల్పన చేస్తాడు. సాధారణ కవుల్లో స్వాప్నిక ప్రవృత్తి మాత్రమే ప్రబలంగా ఉంటుంది. ఫ్రాయిడ్ ప్రభావంతో రూపొందిన ఆధునిక కవితావాదాలు ఈ ప్రవృత్తిని బలపరుస్తాయి. ఇలాంటి వారిని గురించే 'A mind that is fragmented is not a beautiful mind, and therefore it is not creative' అంటారు జిడ్డు కృష్ణమూర్తి. కవిత్వం అబద్ధం అనడం కూడా ఇందువల్లనే. కాని వాస్తవికవాదులు, అధివాస్తవికవాదులు ఇందులో శ్రేష్ఠతను గుర్తించారు.

స్వప్నంలోని అవస్థలు దేశకాల నిమిత్తాదులతో బంధించబడేవికావు. నియమబద్ధములుకావు. చిన్నదైన శరీరంలో మేడలు, మిద్దెలు, యుద్ధాలు, అడవులు, కొండలు మొదలైనవి ఇమడవుకదా? ఇండియాలో కలగనేవాడు అమెరికాని - ఆఫ్రికాని కలిపి చూస్తూ ఉంటాడు. ఇది సహజంగా జరిగేది కాదుగదా? తన శరీరంలో తానే తిరుగుతూ ఉంటాడు. తన శరీరంలోని తాను బయటకు వస్తాడు. తన తల నరకడం తానే చూస్తాడు. రాత్రి కలగనే వాడికి పగలు కనిపిస్తుంది. ఏ సాధనాలు లేకుండా అప్పటికప్పుడు అద్భుతవస్తువులు చేస్తాడు. 'పక్షినయ్యేద, చిన్నిబుఋక్ష మయ్యేదను' అన్నట్లుగా మారిపోతూ ఉంటాడు. జడం జీవంగా మారుతుంది. జీవం జడంగా మారుతుంది. ఇదంతా చూస్తూ ఉంటే లోకధర్మం వేరు. స్వప్నధర్మం వేరు అని తెలుస్తుంది. భరతుడు ఈ విషయాన్నే కావ్యప్రపంచంలో లోకధర్మి - నాట్యధర్మి అని చూపించాడు. కలలో మనం చూసేది కేవలం దృశ్యం. దానిని సృష్టించే వాడు ఈశ్వరుడని రామానుజుడంటాడు. జీవుడే అని శంకర భగవత్పాదుడు చెప్తాడు. 'పలికించెడివాడు రామభద్రుండట!' అని పోతన అంటాడు ''నేనేదో విరచిస్తానని'' శ్రీశ్రీ అంటాడు.

స్వప్నం అబద్ధమైనా స్వప్నానుభవం యదార్థమనిపిస్తుంది. ఇందులో భావాలే యథార్థస్ఫూర్తిని కల్పిస్తాయి కాని చర్యలు కలిగించవు. ఈ సూక్ష్మరహస్యాన్ని బట్టే అభినవగుప్తుడు 'అలౌకికవైచిత్ర్య సారోహి రసః' అని రస సూత్రాన్ని అద్భుతంగా వ్యాఖ్యానించాడు. 'వైచిత్రి' అంటే ఇక్కడ సౌందర్యమని అర్థము. అలౌకిక సౌందర్యసారమే రసమని అభినవగుప్తుని అభిప్రాయము. రససూత్రాన్ని ఉత్పత్తి వాదము - అనుమితివాదము - భుక్తివాదము - అభివ్యక్తివాదము అనేవి వివరిస్తున్నాయి. రసము పాత్రలలో ఉంటుందా? అనేది రసచర్చ. అభినవగుప్తుడు రసం సహృదయ నిష్ఠమని అన్నాడు.

వేదాంతులు అంగీకరించిన వాసనను (పూర్వానుభవం) గ్రహించి అభినవగుప్తుడు ఈ వాదం కొనసాగించాడు. హరిశ్చంద్రుడు - చంద్రమతి లాంటి వారిలో కరుణ - శాంతాది రసాలుంటాయి. నటులు వానిని అనుకరిస్తారు. అంతవరకు అద్దంలా నిర్మలంగా ఉండే సహృదయులు మనసులో అప్పుడు పూర్వవాసనకారణంగా ఆ కరుణ శాంతాదులు ద్బుద్ధమౌతాయి. సహృదయులలో వాసనా రూపంగా ఉండే రసాన్ని అభివ్యక్తం చేయడం వలన దీనికి అభివ్యక్తి వాదమని పేరు కలిగింది. స్వప్నంలో ఆవరణ - విక్షేపశక్తులు నిర్వహించిన వ్యాపారమే ఇక్కడ కావ్యజగత్తులో విభావానుభావ సంచారీ సామగ్రి వలన పునరావృత మౌతుంది. ఇది కలకి కవిత్వానికి ఉన్న మౌలికసంబంధము. రెండింటిలోనూ పూర్వవాసనలే ప్రధానపాత్రను నిర్వహిస్తాయి. రెండూ అయథార్థములే. రెండింటి అనుభవాలు యథార్థములే. సాధారణీకరణం కూడా రెండింటిలోనూ ఉంటుంది. అయితే కలకీ కవిత్వానికీ ఒక భేదముంది. కలలో ఏరసం దానికి సంబంధించిన అనుభవాన్నే ఇస్తుంది. కవిత్వంలో హర్షమూ హర్షాన్నే ఇస్తుంది. శోకమూ హర్షాన్నే ఇస్తుంది. దీనినే వైచిత్రి అని, సౌందర్యమని అన్నారు. లౌకికమైన ఆనందంకంటే భిన్నమైన ఈ ఆనందాన్నే కావ్యానందమన్నారు. రసము సౌందర్య హేతువని భరతుని మాట.

అలౌకికత్వాన్నే లోకోత్తరమని, లోకాతిక్రాంతమని అలంకారికులు పేర్కొన్నారు. ''లోకోత్తరవర్ణనా నిపుణః కవిః'', ''లోకోత్తర వర్ణనా నిపుణ కవికర్మకావ్యమే'' అనే వాక్యాలు అలౌకిక సౌందర్య సాధకమైన, అంటే రసపోషణ సమర్థమైన కవిని, కావ్యాన్ని గూర్చి చెప్తాయి. ఈ వాక్యంలో 'నైపుణ్య' మనే మాట ఎన్నదగినది. కవిలో ఒక కౌశలం ఉంటుంది. **"The true poets are not followers of beauty - but the august masters of beauty"** అంటాడు **Walt Witman.** కవిత్వాన్ని కేవల స్వాప్నికస్థాయిలో అభాసరూపంగా వదలక చిదానందస్థితికి తీసుకుపోవడం ద్వారా సౌందర్యాన్ని స్వాధీనం చేసుకునే దార్శనిక స్థాయి కలవాడే కవి అని పై మాట కర్థంగా కనిపిస్తుంది. దీనినే భారతీయులు ''యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే'' అన్నారు. ఈ వాక్యంలో రోచకత్వం ప్రధానమైనది. కల మన రుచిని బట్టి స్వాధీనమయ్యేదికాదు. అందుకు భిన్నంగా కవి రసాన్ని స్వాయత్తం చేసుకుంటాడు. అప్పుడే కవిత్వం మన ఆత్మను ప్రబుద్ధం చేస్తుంది. శాశ్వతానందాన్ని - అంటే బ్రహ్మానందసహోదరమైన కావ్యానందాన్ని ఇస్తుంది. ఇది వేదాంతుల మతం. ఈ అభిప్రాయాన్నే ఇంకొక వేదాంతి అయిన ఖలీల్ జిబ్రాన్ **"Beauty is that which attracts your mind - And that which loves to give and not to receive"** అంటూ వివరిస్తాడు.

లౌకికవిషయాన్ని అలౌకికంగా మార్చే వ్యాపారాలు ఐదున్నాయి. ''సాధారణ - చర్వణ - స్పందన - భావన - వ్యంజన అనునవి అలౌకిక వ్యాపారములు'' అని వేలూరి శివరామశాస్త్రిగారు వివరించారు. 'సాధారణ' వ్యాపారం స్వగతత్వ - పరగతత్వ భేదం లేకుండా చేస్తుంది. దీనినే సాధారణీకరణం అంటారు. 'చర్వణ' అంటే నమలడమని అర్థము. శృంగారాది రసముల ననుభవించడం చర్వణమంటారు. 'స్పందన' అంటే కదలిక - గర్భంలో శిశువు కదలినట్లని అర్థము 'వాసన' ఈ స్పందనకు ప్రధాన హేతువు 'భావన' అంటే ఊహ 'భావనా నామభవిత్రః భవనానుకూలః వ్యాపారః' అన్న వాక్యం జరగేది

జరగడానికి అనుకూలమైన ఊహ చేసే వ్యాపారమని అర్థము. ఇదొక సంస్కారవిశేషము. 'వ్యంజన' అంటే శబ్దశక్తి విశేషము. ఈ వ్యాపారం వల్ల శబ్దాలకు అర్థాంతరాన్ని స్ఫురింపజేసే శక్తి లభిస్తుంది.

''అలౌకికః - లౌకిక సామగ్రీ జన్య విలక్షణః లౌకిక సామగ్రీ జన్యుస్తు ఏకస్ప్రైవ సుఖాయత స్యాపి పర్యన్తే వైరస్యాయైవేతి బోధ్యమే'' అని కావ్య ప్రకాశం చెప్తుంది. లౌకిక సామగ్రి నుండి పుట్టి దానికంటె విలక్షణమైనది అలౌకికము. లౌకికసామగ్రివలన పుట్టినది. ఈ వైలక్షిణ్యం లేనిదైనా, ఒకనికి సుఖాన్నిచ్చేదైనా చివరకు విరసంగానే ఉంటుందని తెలుసుకోవాలని పై వాక్యం చెప్తుంది.

''అలౌకిక పదేన ప్రత్యక్షానుమానే వ్యావర్త్యేతే'' అని సాయణుల తైత్తిరీయ సంహితాభాష్యం చెప్తుంది. అంటే షట్ప్రమాణాలలో శ్రుతి - ఉపమాన, అర్థాపత్తి అనుపలబ్ధి ప్రమాణాల ద్వారానే అలౌకికత్వాన్ని అనుభవించగలంగాని ప్రత్యక్షానుమాన ప్రమాణాల ద్వారా అది ఆస్వాదనీయం కాదని అర్థము. ఇందుకే ''లోకాతిక్రాంతగోచరతయా'' అనే పదానికి ''ప్రమాణాంతరాగోచరతయా'' అని స్థూలంగా అర్థం చెప్పారు వ్యాఖ్యాతలు.

ఉద్భటుడు - భామహుడు అతిశయోక్తి - ఉత్ప్రేక్షాలంకారాలను నిర్వచించడంలో ఈ అలౌకిక ప్రవృత్తినే చూపేరు.

'నిమిత్తంతో యత్తువచో లోకాతి క్రాంతగోచరమ్

మన్యన్తేఽతిశయోక్తికి తామలంకారతయా బుధాః' (కావ్యాలంకరసారఃఽ వి)

ఏదైనా ఒక వచనం చిన్నకారణాన్నాశ్రయించుకుని లోకాతిక్రాంతగోచరత్వాన్ని అందిస్తే అది అతిశయోక్తి అవుతుంది. ప్రతీహారేందు రాజు వ్యాఖ్య.

''లోకాతి క్రాంత విషయం భావాభావాభిమానతః సంభావనేయముత్ప్రేక్షా'' (కా. అ. సా. ఽ వి)

దేనిచే లోకాతి క్రాంతమైన విషయం సంభావించబడుతుందో అది ఉత్ప్రేక్ష. అది భావానికి అభావానికి కూడా అభిమానం కలిగి ఉండడం వలనరెండు రకాలుగా ఉంటుంది. అని ప్రతీ హారేందు రాజు వ్యాఖ్య. భామహుని అతిశయోక్తి వివరణ కూడా ఉద్భటుని వివరణలాగే ఉంది.

''ఏ దివ్య పురుషు వీశాద్వలాంకూర - శేఖరమ్ముల లిఖించిరో! యివెల్ల
ఈ వాయువీచిలో నేయప్సరస్సమా - జమునింపిరో గీతిసముదయంబు
ఏ దివ్య శిల్పులీ రోదసీ కుహరాన - వ్రాసిరో దివ్య శిల్పంబులిన్ని
ఈ పథాంతరమునందే పురాణమునీంద్ర - సంతతులో ప్రశంసలు పౌనర్స్తు
టంగనిన పూర్వపల్లవ నృపచరితలె - వ్రాయఁబడి గీయఁబడి యుపన్య
సింపబడి శ్రోత్రపేయమై చెన్ను దాల్చె - నీ యతీంద్రియశక్తి నాకెట్టులబ్బె!''

గడ్డిపరకల చివరలలో పూర్వపల్లవరాజు చరితులు వ్రాయబడడం, వేఁగి గాలులలో అప్సరసలు పాటలు నింపడం. నిరాధారమైన రోదసీకుహరంలో దివ్యశిల్పులు పల్లవశిల్పాలు వ్రాయడం. వేఁగి వీధులలో పురాణమునులు ఉపన్యాసాలు చెప్పడం - ఇదంతా అతిశయోక్తి. కాని ఇది ఆత్మాశ్రయమైన

రచన. ఇందులో కవి అనుభవం సాక్షిగా కనిపిస్తూంది. ''కామయ్య దగ్గరా కంయ్ కుంయ్‌లు'' అన్నట్లుగా ఆయనను తేలికగా తీసిపారెయ్యడానికి వీలులేదు. ఇది అతీంద్రియ శక్తి అని. తనకేవిధంగా అబ్బిందో తెలియడం లేదని ఆయన ఘోషిస్తాడు. ఇందులో అందంలేదని, ఇది కవిత్వం కాదని అనే సాహసికుడెవ్వడూ ఉండడు. ఇటువంటి సందర్భాలలోనే అతీంద్రియశక్తిని గూర్చిన సౌందర్యవాదనలు బలపడుతున్నాయి.

బుద్ధిహేతుకమైన అపరోక్షజ్ఞానము లేక అతీంద్రియ దృష్టిసృష్టి సామర్థ్యం కలదని, అందులోని సత్యాన్ని గ్రహించడానికి తార్కికవిచారం చాలదని, అపరోక్షజ్ఞానం ఆత్మసాన్నిధ్యాన్ని చేరుస్తుందని, ఇంద్రియ పరిశీలన కంటె - గణిత, తర్కశాస్త్ర సంబంధమైన వివేచనకంటె అది భిన్నంగా ఉంటుందని, వ్యర్థజ్ఞానానికి భిన్నంగా నిమేషమాత్రంలో సర్వవస్తుతత్త్వాన్ని దర్శించే సార్వభౌమ జ్ఞానమదని - అక్వినస్, ఎన్.హెచ్.బ్రాడ్లీ, బెర్గ్‌సన్, రూసో వంటి తత్త్వవేత్తలు స్పష్టం చేసి ఉన్నారు. ప్లేటో దీనినే Super - Rational Divine Madness అన్నాడు. హేతు తర్కాతీతమైన ఈ దివ్యోన్మాదంతో జీవుడు అహంకారోపాధుల నతిక్రమించి విశ్వాత్మకి ఉపకరణంగా మారుతున్నాడని బ్రహ్మసూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ వివరించారు.

**ఉపయుక్త గ్రంథాలు:**


1. బ్రహ్మసూత్రము - డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్, అను: రత్నాకర బాలరాజు (కె. రాధాకృష్ణయ్య - ఎ. చిదంబరరెడ్డి 1971)
2. AESTHETICS - Youri Borev. (Progress Publishers - Moscow)
3. మాండూక్యోపనిషత్తు, తెలుగు వివరణ త్యాగీశానందస్వామి, రామకృష్ణ మఠము.
4. Truth And Actuality - Jiddu Krishna Murty - Victor Gallancz Ltd., London - B.I. Publications, - Bombay, 1977.)
5. కావ్యాలంకార సంగ్రహము - శిరోమణి సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి వ్యాఖ్య.
6. వ్యాసభారతి - వేలూరి శివరామశాస్త్రి, సంపాదకులు: జంధ్యాల మహతీ శంకర్ - 1981.
7. The Treasured Writins of Kahlil Gibran-CASTLE - USA - July 1982.
8. కావ్యాలంకారసారః - ఉద్భటుడు. ప్రతీహారేందు రాజువ్యాఖ్య.
9. నాట్యశాస్త్రము - అభినవగుప్త వ్యాఖ్య.
10. ఆంధ్రప్రశస్తి - విశ్వనాథ సత్యనారాయణ.

# పుత్తడి బొమ్మా పూర్ణమ్మ

- బులుసు - జీ - ప్రకాష్

బంగరుబొమ్మను పూర్ణమ్మను పరిచయం చేయడానికి ముందు, జగజ్జనని దుర్గాదేవిని అభివర్ణించారు మహాకవి గురజాడ.

''కొండల నడుమను
కోనొకటున్నది
కోనకి నడుమా
కొలనొకటుంది
కొలని గట్టునా కోవెల లోపల
వెలసెను బంగరు దుర్గమ్మ''

తరువాత పూజారింటిలో చిన్నపిల్ల అయిన పూర్ణమ్మ పుట్టింది. బంగరు దుర్గకు మల్లే బంగారుచ్ఛాయ. దుర్గతో సమానురాలు కూడాను. అమాయిక అయిన పసికందు దేవతతో సమానం కదా!

పూర్ణమ్మ ఎల్లప్పుడూ దుర్గాదేవికై భక్తి ప్రపత్తులతో సనలు కోసేది. పూజలు చేసేది. ఎందుకో

''ఏయే ఋతువుల పండే పళ్లను
ఆయా ఋతువుల అందించి''

ఏ ఋతువు పండ్లను ఆ ఋతువు లోనేనట ఆమె దుర్గకై వినియోగించింది. కారణం, ఒక ఋతువులో పండిన పండును, వేరొక ఋతువులో భుజించడం - అంటే అకాల ఫలభక్షణం అనారోగ్యం కలుగజేస్తుంది.

దుర్గమ్మకు పండ్లను అందిస్తూ అందిస్తూ వుండగా కొన్ని ఋతువులు గడిచాయి. ఋతువులతో పాటే పూర్ణమ్మ వయస్సూ గడిచింది. అంటే పూర్ణమ్మ పెరిగి పెద్దదైంది. ఫలమాధుర్యాలతోపాటు ఆమె వర్తనంలో కూడా మాధుర్యం వుంది. ఫలచ్ఛాయ వంటి శరీర చ్ఛాయ కూడా అమరింది.

''కాసుకులోనై తల్లీ తండ్రీ
నెనరూ న్యాయం విడనాడి
పుత్తడి బొమ్మను పూర్ణమ్మను ఒక
ముదుసలి మొగుడుకు ముడివేస్రీ''

ధనదాసులై బిడ్డపైగల ప్రేమనూ, న్యాయాన్యాయ విచక్షణనూ విడనాడేరు పూర్ణమ్మ తల్లిదండ్రులు. ఆమెను ఒక వృద్ధునకిచ్చి కన్యాశుల్కం గ్రహించారు. ఆమె భావిని గురించి కించిత్తైనా యోచించలేదు. అట్టి బంగరు లేజవరాలు సత్వరమే వైధవ్యం అనుభవించ వలసి వస్తుందనే ఇంగితజ్ఞానం వారికి కలుగలేదు. పైగా ఎలాంటి అమ్మాయిని విక్రయించారో చూడండి. పుత్తడి బొమ్మను పూర్ణమ్మనట! అసలు పూర్ణమ్మే బంగారం! బంగారాన్ని బంగారానికై అమ్మేరు!

''ఆమని రాగా దుర్గ కొలనులో
కలకల నవ్వెను తామరలు
ఆమని రాగా దుర్గ కొలనులో
కిలకిల పలికెను కీరములు''

వసంత ఋతువు ప్రవేశించగానే కొలనులో తామరలు కలకల నవ్వాయి. చిలుకలు కిలకిల పలికాయి. వీనితోపాటు నిండు జవ్వని అయిన పూర్ణమ్మ కూడా నవ్వ వలసి ఉంది. కాని ఆమె నవ్వలేకపోయింది. పైగా ఏడవ వలసి వచ్చింది. అది ఆమె దైన్యావస్థ.

''ఆటల పాటల తోటి కన్నియలు
మొగుడు తాతయని కేలించ''

అసలే ఆమె ఏడుస్తోంది. ఏడ్చేవారిని ఓదార్చడం న్యాయం. అలా కాక ఏడుస్తున్న పూర్ణమ్మను ఇంకా ఏడ్పించారు సకియలు. పుండుమీద కారం చల్లారు. మొగుడు 'తాత' అన్నారు.

''కొన్నాళ్లకు పతి కొనిపోవచ్చెను
పుత్తడి బొమ్మను పూర్ణమ్మను,
చీరలు, సొమ్ములు చాలగ తెచ్చెను''

పూర్ణమ్మను కాపురానికి తీసుకుని వెళ్లడానికి భర్త వచ్చాడు. వచ్చినపుడు ఆమెకోసం చీరలు కూడా తెచ్చాడు. తాను ఆటలాడుకొనే బొమ్మలకే చీరలు కట్టేది. కాని తనకు చీరలు కట్టుకునే వయస్సే రాలేదు పాపం! అయినా చీరలు కట్టవలసొచ్చింది!

''పెద్దలకప్పుడు మొక్కెను పూర్ణమ,
తల్లీ తండ్రీ దీవించి:
దీవన వింటూ ఫక్కున నవ్వెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ''

తాను తల్లిదండ్రులకు నమస్కరించగానే వారు దీవించారు. పూర్ణమ్మ పకాలున నవ్వింది. వారు 'దీర్ఘ సుమంగళీ భవ' 'సుఖీభవ' అని దీవించి వుంటారు. ఆమె అందుకే నవ్వింది. ఆమె ఎలా దీర్ఘ సుమంగళి అయేది, ఎలా సుఖించేది, ఆమెకే తెలుసు. వారి దీవన నిష్ఫలమనీ, నిస్సారమనీ నవ్వింది.

తన పయనానికి ముందు అన్నదమ్ములకు వీడ్కోలు సందేశమిచ్చింది పూర్ణమ్మ:

''అన్నలారా! తమ్ములారా!
అమ్మను అయ్యను కానండీ
బంగరు దుర్గను భక్తితొ కొలవం
డమ్మల కమ్మా దుర్గమ్మ.
ఆయా వేళల పూసే పువుల
ఆయా ఋతువుల పళ్లన్నీ

భక్తిని గోసి శక్తికి యివ్వం
డమ్మల కమ్మా దుర్గమ్మ''

పూర్ణమ్మ, వృద్ధులైన తల్లిదండ్రులను ఏమరక సేవించమన్నది. తోడ్తోనే దుర్గమ్మకు కూడా ఫలపుష్పాదులు వేళకు అందించమన్నది. ఇదిగాక, మరొక ముఖ్య విషయం చెప్పింది పూర్ణమ్మ.

''నలుగురు కూచుని నవ్వే వేళల
నా పేరొక తరి తలవండి
మీ మీ కన్నబిడ్డల నొకతెకు
ప్రేమను నా పేరివ్వండి''

నలుగురూ ఆనందంతో నవ్వుకొనునప్పుడు తనను తలచుకొమ్మన్నది. తన అన్నదమ్ములకు కుమార్తెలు కలిగినట్లయితే ఏ ఒక్క పిల్లకైనా తన పేరు పెట్టమ్మన్నది. ఎందుకంటే తన ప్రయాణానికి తిరుగుముఖమే లేదు కనుక! ఆమె అలా చెబుతున్నప్పుడు ఆమె కంటినుండి నీరు వచ్చింది. వెన్వెంటనే కన్నీరు తుడుచుకుని కలకలా నవ్వింది. ఆమెకు ఏడవాలో నవ్వాలో తెలియని దుస్థితి!

ప్రయాణానికి ముందు దుర్గను దర్శిద్దామని వెళ్ళింది పూర్ణమ్మ.

చీకటి పడింది. ఆలమందలు, పక్షులు గృహోన్ముఖులయ్యాయి. ఇంత చీకటి పడ్డా పూర్ణమ్మ తన లౌకిక గృహానికి చేరలేదు. ఆమె తన ప్రయాణంలో గమ్యం చేరింది. అదే దుర్గాదేవి హృదయ గృహం!

దుర్గ విగ్రహానికి మునుపటి కంటె కళాకాంతులు మిక్కుటమయ్యాయి.

---

*Continued Page No. 34*

when he was finally called upon, he declared: "It seems I finally have been asked to give my address. Gentlemen, it's the Belvedere Hotel, and that's where I'm headed this moment, since it's two hours past my usual bedtime. I thank you." And with this, he strode out of the hall.

A speaker, known for his long speeches, went on and on. His audience could stand no more, and gradually began to drift quietly away. The speaker finally looked up and saw there was only one man left in the hall. Regardless, the speaker was determined to finish his prepared speech. When at last he came to the end of his speech, he went up to the man and thanked him for being polite enough to stay to the end. "Oh, no," said the man, "I'm the caretaker, and I have to wait to lock up the hall."

The would-be Congressman's voice was getting quite dry and tired, but when he saw he was on the last page of his speech, his voice suddenly crackled with new vigour. "I wnat," he cried, "I want housing reform,

*Continue Page No. 63*

# తెలంగాణా వచన కవిత్వం

(గత సంచిక తరువాయి)

– సీతారాం

''మాకు సంస్కారమెవరు నేర్పిండు, తల్లీ
మేం మోటు మనుషులం - మర్యాదెవరు నేర్పిండు తల్లీ
నల్ల తిప్పంగానే - నీళ్ళు రావు గదమ్మ మాకు
మేం నాజుగ్గెట్లుంటం
ఇరువై గజాల లోతునుంచి నీళ్ళు చేదాలి
నీళ్ళయిపోతే - అదే లోతు నుంచి మొరం బొక్కెన చేదాలి

మట్టి పిసికి సొంచెలు పొయ్యాలె''

(మాకెవరు నేర్పింద్రు తండ్రీ... పుట :30)

సంస్కృతీ కరణకు గురైన తెలంగాణా కవి తన సాంస్కృతిక మూలాలను భాష ద్వారా వెతికి పదిలపరచుకోవటం అవసరం. దీనిని కవులు ఇప్పుడిప్పుడు గుర్తిస్తున్నారు. వచన కవిత్వం రాయడానికి ఒక ప్రామాణిక భాష రూపొంది కవులకు అందుబాటులోకి వచ్చింది. దీనిని కవులు ప్రాంతీయ తేడాలను, భాషాపరమైన తేడాలను ప్రక్కన పెట్టి మరీ ఆదరించారు. దీనివల్ల ఆయా ప్రాంతాల మధ్యతరగతి వర్గం నుంచి వచ్చిన కవులు, కవిత్వాన్ని ఆయా ప్రాంతాల మధ్య తరగతికే అందించడంతో సరిపెట్టుకున్నారు. ప్రాంతీయంగా భాషలకు ఉండే ప్రత్యేకతల్ని కవి గుర్తించడం ఈనాడు అవసరం. తెలంగాణా ప్రాంతంలో వచన కవిత్వం మధ్య తరగతిని దాటి ముందుకు పోవాల్సి ఉంది. తెలంగాణా నుడికారాన్ని తెలంగాణా కవులు పట్టించుకోక పోవడం ఆశ్చర్యకరమే.

సుధాకర్ రాసిన 'తెలంగాణా ఉత్తరం' ఒక మాండలికాన్ని ఆ ప్రాంతకవి ఎంత సునాయసంగా ప్రయోగించగలడో తెలియజెపుతుంది.

'' ఏం రాయాలె - శాన పరేషాన్‌ల బడ్డం
ఎటూ సుదరాయిస్త లేదు - బుగుల్ బుగుల్‌గ బతుకుతున్నం
నాత్రిల్ల నిద్రపడ్తలేదు - అయిను పోరగాండ్ల మీద
నిగరానీ బెట్టిండు - దర్వాజలుగొట్టి - జీపులల్ల యేస్కపోతున్నరు
మొన్న అయితారం ఊరిమీదబడి - ఆగమాగం జేసింద్రు
మా కుత్కెలమీద - బందూకులు బెట్టి - కడుపలదన్ని పోయింద్రు
గీ గత్తర ఎంతకాలముంటదో గాని - సలికాలం దూప బెడతాంది
ఎండకాలం సలి పుడతాంది.
సడక్ సొంట పోకుంటయ్యింది''

సామాజికాంశాలను వస్తువుగా గ్రహించినప్పుడు ఇటువంటి వ్యక్తీకరణ అవసరం అని తెలంగాణా కవి గుర్తించడం ఈ దశాబ్దంలోనే జరిగింది.

1990ల తర్వాత వచ్చిన కవిత్వంలో ఎటువంటి ధోరణులు చోటు చేసుకున్నాయో ఒక తెలంగాణా ప్రాంత కవి ఈ విధంగా వ్యాఖ్యానిస్తున్నాడు. 'గతి తార్కిక భౌతికవాదం' అన్న కవితలో

1979 జూన్ 26, ఆంధ్రదేశంలోని ఒకానొక గోడమీద

''రక్తాన్నైనా చిందిస్తాం - సమసమాజం సాధిస్తాం'' - P.D.S.U.

1996 ఆగస్టు 26, ఆంధ్రదేశంలోని అదే గోడమీద

''రక్తాన్నైనా చిందిస్తాం - మాదిగ హక్కులు సాధిస్తాం'' - M.R.P.S.

ఇంచుమించుగా రెండున్నర దశబ్దాల కాలంలో వచ్చిన సామాజిక పరిణామాలను ఈ కవిత వ్యక్తం చేస్తున్నది. ఈ రెండు రకాల నినాదాలు తెలంగాణా ప్రాంత గోడలమీద కూడా చదువుతున్నాడు. ఈ ఇరవై ఏడేళ్ళ అంటే దరిదాపుగా మూడు దశాబ్దాల చైతన్యం ఏ దిశనుంచి ఏ దిశకు మారిందో చూపించాడు. 1970ల నాటికి భారతీయ సమాజంలో వర్గ - కుల సంబంధాల విషయమై చర్చ మొదలైంది. అదిక్కడ 1990లకు స్పష్టరూపాన్ని తీసుకుంది. కులవ్యతిరేక చైతన్యంతో మొదలై 'కులనిర్మూలన' నినాదం ప్రకకునెట్టబడి కులాధిపత్యం దిశగా సాగుతున్న సామాజిక ఉద్యమం స్వాతంత్ర్యానంతర రాజకీయాల అవలక్షణాలన్నిటినీ తనలో కవులపుకొని దళితవాదం ముందుకొచ్చింది. సమాజంలోని క్రింది కులాల అణచివేతకు, అవమానాలకు, అధీనతకు పరిష్కారాలు ఏ సిద్ధాంతమూ వెతకలేదనే ప్రతిపాదనతో. ఒకవైపు బ్రాహ్మణీయ ఆధిపత్య భావజాలంతో తలపడుతూ, మరోవైపు వామపక్ష సిద్ధాంతాలను వ్యతిరేకిస్తూ దళిత ప్రజాస్వామిక విప్లవంగా, పరిణమించనున్న దళిత కవిత్వం వచ్చింది.

విప్లవ కవిత్వంలోని రాజ్యవ్యతిరేక స్వభావం వల్ల ప్రభుత్వం స్పందించింది. కాని సమాజంలోని ఏ 'ఆధిపత్య వర్గమూ భయపడలేదు' అన్న సూత్రీకరణతో తెలంగాణాలో దళిత కవిత్వం ముందుకు వచ్చింది. తెలంగాణా ప్రాంతం నుంచి 'బహువచనం', 'మేమే' లాంటి సంకలనాలు ఈ అంశాన్నే తెలియపరుస్తున్నాయి. కుల వివక్షకు, పీడనకు వ్యతిరేకంగా కవులు కవిత్వం రాస్తున్నారు. వేముల ఎల్లయ్య, చిత్రం ప్రసాద్, ఎం. వెంకట్, అంబటి వెంకన్న, కొంపల్లి వెంకట్, పగడాల నాగేందర్ తదితర కవులు తెలంగాణా గ్రామాల్లోని కులపీడనను నిర్దిష్ట అనుభవం ప్రాతిపదికగా నిరసించారు. ఈ దశాబ్దంలోనే స్త్రీవాద కవిత్వం, మైనారిటీ కవిత్వం వచ్చింది. మైనారిటీల మీద జరిగే అన్ని రకాల అణచివేతల్ని, దాడులను ప్రతిఘటిస్తూ రాసిన కవిత్వం ఉంది. మైనారిటీల జీవన స్థితిగతులను, వారి రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక చైతన్య స్థాయిని కవిత్వం ద్వారా మైనారిటీ కవులు వెల్లడించారు. దళితవాదం కులాధిక్యతా మూలాలను ప్రస్నిస్తే, స్త్రీ వాదం పితృస్వామ్య భావజాలాన్ని ప్రశ్నించింది. పురుషుడి ఆధిపత్యం మీద స్త్రీల దృష్టికోణం ప్రసరించి చేసిన కవిత్వమూ ఉంది. విమల విప్లవ దృక్పథంలో భాగంగా స్త్రీ వాదాన్ని చూస్తే. సత్యలక్ష్మి, సంధ్య, మానస, కర్రి విజయ కుమారి, నక్కా విజయ భారతి పురుష దృక్పథాన్ని, దళిత స్త్రీ వాద దృక్పథంలో కవిత్వం రాశారు. అయితే స్త్రీ వాద కవిత్వం తెలంగాణా ప్రాంతం నుంచి తక్కువగానే వచ్చింది.

'90ల తర్వాత వస్తున్న కవిత్వంలో తృతీయ ప్రపంచదేశాల చైతన్యానిది ఒకపాయ. ఇది ప్రధానంగానే కనిపిస్తుంది. ముఖ్యంగా 90 - 95 మధ్య దళిత స్త్రీ వాదాలు ఉద్ధృతంగా సాగి 96 నాటికి సంపుటాలుగా ప్రకటితమయ్యాయి. 'వస్తువు' రిపీట్ కావడం మొదలైంది ఈ రెండు రకాల కవిత్వంలో. అందువల్ల చెప్పిందే చెప్పడం పెరిగింది. తృతీయ ప్రపంచదేశాల చైతన్యం తెలంగాణా కవులలో అధికంగా కనిపిస్తుంది. 'డబ్బు పిట్ట', 'ఇండియా ప్రైవేట్ లిమిటెడ్' లాంటి కవితా సంపుటాలు వచ్చాయి. నూతన ఆర్థిక విధానాలు భారత దేశంలో అమలు కావటం మొదలయ్యాక జరుగుతున్న పరిణామాల్ని ఈ సంపుటాలు పట్టుకునే ప్రయత్నం చేశాయి. 'న్యూ ఎకనమిక్ పాలసీ' అమలు మొదలైన క్రమంలో మధ్య తరగతి జీవన విధానంలో వచ్చిన మార్పును 'డబ్బుపిట్ట' సమగ్రంగా ఆవిష్కరిస్తే 'ఇండియా ప్రైవేట్ లిమిటెడ్' భారతీయార్థిక వ్యవస్థని, భారతీయ సామాజిక మార్పులు, పర్యవసానాలు వాటి ముప్పుల్ని పట్టి చూపే ప్రయత్నం చేసింది. ప్రసేన్ 'ఏదీ కాదు' లాంటి సంపుటాలు ఈ నేపథ్యంలోనే గ్యాట్ ఒప్పందాలను వాటిలోని కుట్రల్ని బహిర్గత పరచడం చేసింది. 'గ్లోబల్ ఎకానమీ' 1980ల తర్వాత పొందుతున్న పెద్ద మార్పులు, జులై 1991 నుంచి అమలవుతున్న ఆర్థిక సంస్కరణలు అందులో భాగంగా 'భారతీయ ఆర్థికం'లో వస్తున్న మార్పులను ఈ కవులు అపూర్వంగా పట్టుకున్నారు. ఈ తృతీయ ప్రపంచదేశాల చైతన్య బీజం 1955లో ఇండోనేషియా పట్టణమైన Banding సమావేశంలోనే ఉంది. అంతకు మూడేళ్ళముందే ఆల్ఫ్రెడ్ సావే 'Third World' అనే మాటను ఖాయం చేశాడు. మన దగ్గర 1970లలో సామ్రాజ్యవాద వ్యతిరేకతగా మొదలై గడిచిన రెండేళ్ళలో ఈ రూపాన్ని తీసుకుంది. 1990ల తర్వాత ప్రపంచీకరణ వ్యవస్థాగత సర్దుబాట్లు, మార్కెట్ ఎకానమీ, సమాచార విప్లవం, సాంస్కృతిక దోపిడి మొదలైన వాటిని ఇక్కడి జీవితాలకు అన్వయిస్తూ రాసిన కవిత్వం వచ్చింది. తృతీయ ప్రపంచదేశాల ఆర్థిక స్థలాల్లోకి చొచ్చుకొస్తున్న పెట్టుబడిదారీ దేశాల భావజాలాన్ని ప్రతిఘటిస్తూ నిలబడ్డ కవిత్వం ప్రధాన పాయగా నిలదొక్కుకుంది. ''పెట్టుబడి ఎక్కడున్నా తన మూసలో సమాజాన్ని పునర్నిర్మిస్తుందనే భ్రమ ఇవాళ మళ్ళీ కొత్త కొత్త రూపాలలో ముందుకు వస్తోంది'' (తెలుగువారి రజక వార్షిక జీవితం - మనలో మనం - బాలగోపాల్ - పుట:) ఈ భ్రమలను పటాపంచలు చేసే కర్తవ్యాన్ని తెలంగాణా కవులు స్వీకరించారు. ఎన్రాన్, కెంటకీ వివాదాలు, కార్పొరేట్ల లాభాపేక్షలు, బహుళజాతి సంస్థల ఆర్థిక లాభాపేక్షలు, ప్రపంచవాణిజ్య సంస్థ ఆకాంక్షలు, పెట్టుబడిదారీ దేశాల ఆకాంక్షలు, వాటివెనుక ఉన్న నిజస్వరూపాన్ని వెనుకాడకుండా ఆవిష్కరించడం తెలంగాణా కవిత్వంలో ఇటీవలి పరిణామం. ఒకప్పుడు ఆర్థిక వస్తువుల మీద కథలు, పెట్టుబడిదారీదేశాల మధ్య పోటీ ఇతివృత్తాలుగా కథలు వచ్చాయి. కాని చెప్పుకోదగ్గ స్థాయిలో కవిత్వం రాలేదు. ఈనాడు మధ్యతరగతి షేర్ పెట్టుబడుల సులభ లాభాల కోరికల దగ్గర్నుంచి దేశ ఆర్థిక వ్యవస్థల పతనం దాకా కవికి వస్తువు. అంతర్జాతీయ రాజకీయ, ఆర్థిక రంగాలలో అమెరికా నిర్వహిస్తున్న పాత్రను గురించి సరైన అంచనాతోనే ఈ 20వ శతాబ్దపు ఆఖరి దశాబ్దంలో కవిత్వం తెలంగాణా నుంచే ఉధృతం కావడం గమనార్హం.

1967లో వచనగేయం ఒక ఉద్యమం అనే వ్యాసం రాస్తూ కుందుర్తి ''నేటి వరకూ రచనగేయం కవితా ఖండికల రూపంలోనే కాలం గడుపుతున్నది. సంపూర్ణ కావ్య దృష్టి అలవరచుకోలేదు. శ్రవ్య కావ్యం సమగ్రంగా ఉండాలంటే జీవితంలోని వివిధ సంఘటనల చిత్రణ, పాత్రల స్వభావ పరిశీలన

వుండాలి'' అన్నారు. అంతకు ఒక దశాబ్దంముందే ఆయన 'తెలంగాణా' రాశారు. కుందుర్తి తరువాత నగ్నముని 'కొయ్య గుర్రం' శీలాని మొదలైనవారు దీర్ఘకావ్యాలు రాశారు. అయితే ఇప్పటికీ వచనంలో దీర్ఘకావ్యాలు రాలేదు. సినారె దీనికి ఒక మినహాయింపు. మనలో ఎవరం ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా సినారె రచనల గురించి సమర్థమైన, నిష్పాక్షమైన విశ్లేషణ ఇంత దాకా రాలేదు. దీనికి గల కారణాలు సాహిత్యేతరమైనవి కనుక ఇక్కడ ప్రస్తావించలేదు. ''జీవితంలోని అనేక అనుభూతులను రమణీయంగా ప్రతిపాదించడానికి వచనగేయం సిద్ధంగా ఉంది'' అన్న కుందుర్తిని గౌరవిస్తున్నట్లుగా అనిపించే దీర్ఘకావ్యాలు రెంటిని సి.నా.రె. రాశారు. వీటిల్లో ఒకటి 'విశ్వంభర' రెండోది 'మట్టి - మనిషి - ఆకాశం'. ఈ రెంటిలోనూ తాత్త్వికగాఢత లేదని ఒక విమర్శ, దీర్ఘ కావ్యం విఫలమైందని మరొక విమర్శ అనధికారికంగా కొనసాగుతూ ఉంది. తెలంగాణా వచన కవిత్వం పరిశీలించేప్పుడు సినారెను ప్రత్యేకంగా అధ్యయనం చేయాల్సి ఉంటుంది. ఇంచుమించుగా అర్ధశతాబ్ది నిరంతర కృషి ఆయనది. పైగా వచన కవిత్వానికి జ్ఞానపీఠ పురస్కారాన్ని అందజేసిన ఖ్యాతి ఆయనది. సినారె తరువాత దీర్ఘ కావ్య రచన చేసినవారిలో పెద్దకవులు ఎవరూ కనిపించరు. మరీ ఇటీవల కాలంలో దళితకవిత్వంలో భాగంగా గౌరీశంకర్ రాసిన 'పాదముద్ర' ఏలియాస్‌లు యువకవులకు దీర్ఘకార్యం మీద ఉన్న ఆసక్తిని తెలయజేస్తాయి.

పర్యావరణ స్పృహ ఈ మధ్యకాలంలో పెరుగుతూ వస్తున్నది. భూమ్మీద జీవరాశులు మనిషి స్వార్థం చేస్తున్న విధ్వంసంతో అంతరించి పోవటం మొదలైంది. పర్యావరణ సమతుల్యత లోపించడం 'ఇకోసైడ్' మొదలైన వాటిని నేపథ్యంగా తీసుకుని 'విశ్వం పుట్టుక నుంచి - బిగ్ బ్యాంగ్' థియరీ ఆధారంగా మనిషి సాధించిన శాస్త్ర సాంకేతిక రంగాల అభివృద్ధిని వస్తువుగా చిత్రిస్తూ 'సుదీర్ఘ జ్ఞాపకం'ను యెన్నం సత్యం రాశారు. తెలంగాణాకు సంబంధించినంతవరకు ఇదే మొదటి పర్యావరణ కవిత. ఇది దీర్ఘకావ్యం కూడా.

నాలుగు దశాబ్దాలు ఆలస్యంగానే అయినా ఇటీవాలి కాలంలో 'ప్రత్యేక తెలంగాణా ఉద్యమం' మళ్ళీ ముందుకు వస్తున్నది. 1992 నుండి కవిత్వంలో అక్కడక్కడా తెలంగాణాకు జరిగిన అన్యాయాన్ని వచన కవులు వ్యక్తం చేస్తూ వచ్చారు. అయితే ఇవి అంతగా సహితీపరులు దృష్టిని ఆకర్షించలేదు. తెలంగాణా - 92 పేరిట జ్వాలాసాగర్ కవిత ఇటువంటిదే. అయితే ఏ ఉద్యమమైనా అది సామాజికంగా సాగేది అయితేనే అందరి దృష్టి దానిమీద పడుతుంది. కవులు విడిగా రాసిన భావాలు మన గుర్తింపులోకి రాకుండానే పోయాయి. అభివృద్ధిలో అనేక అసమానతలున్న తెలంగాణాకు సంపూర్ణ న్యాయం చేకూర్చే లక్ష్యంతో ఉద్యమించడం సమంజసమా కాదా అనే ప్రాథమిక ప్రశ్న ప్రక్కన పెడితే ఇప్పుడిప్పుడు రూపు దిద్దుకుంటున్న ఉద్యమం పట్ల కవులకూ కొంత ఆకర్షణ ఉంటుంది. నిజానికి వాస్తవిక సమస్య కంటే, ఆ సమస్యను రంగం మీదకు తెచ్చిన వ్యక్తుల పట్ల ఆకర్షణ ఎక్కువగా ఉంటుంది. అలాగే ఆ సమస్యపై ఉద్యమిస్తున్న తీరూ, ప్రజలనుంచి వస్తున్న స్పందనా కవిని ఆలోశింపజేస్తాయి. ఇటువంటి ఆకర్షణలో భాగంగానే 'నా తెలంగాణా' పేరిట జూలూరి గౌరీశంకర్ దీర్ఘకవితను ప్రచురించాడు. మొదటి నుంచి తెలంగాణా అందరి అవసరాలనూ సమానంగానే తీరుస్తూ వస్తున్నది. రాజకీయ నాయకులకు రాజకీయంగానూ, ఉద్యమ కారులకు ఉద్యమ భూమిగానూ, ఎవరి అవసరాలు వారివి. తెలంగాణేతరులకు, తెలంగాణా ప్రాంతీయులకు

ఒకేరకంగా 'తెలంగాణా' ప్రయోజనాలను నెరవేరుస్తూ వచ్చింది. వాస్తవానికి విస్తృత ప్రయోజనాలే లక్ష్యంగా ప్రజాబాహుళ్యానికి జరిగే మేలు అధికంగా ఉన్నవే ప్రజా ఉద్యమాలు అవుతాయి. అయితే ఈ నాటి సామాజక ఉద్యమాలు కొద్దిమందితో కూడిన ఒకానొక కూటమికి చెందినవే ఎక్కువ. మధ్య తరగతికి చెందిన విద్యావంతుల ఉద్యోగ సద్యోగాల స్వప్రయోజనాలే (వెస్టెడ్ ఇంటరెస్ట్స్) ఉద్యమ స్వభావాన్ని నిర్ణయించే స్థితీ ఒక్కోసారి రావచ్చు ఇట్లా భావించడం అంటే ఉద్యమాన్ని తక్కువ చేయడమో, కించపరచడమో కాదు తాత్కాలిక ప్రేరణగానైనా ఇటువంటివి ఉద్యమానికి ఉపకరిస్తాయి. అయితే ఇదీ ప్రజా ఉద్యమం అవునా కాదా అన్నది కవులు తేల్చుకోగలగడంలో జాగ్రత్త అవసరం. అసలీ రకమైన ఉద్యమాలను యావత్ ప్రజాకోటి ఉద్యమంగా భాసింపజేసే నేర్పు ఆ వర్గానికి ఉంటుంది. స్వవర్గ ప్రయోజనాలను ప్రజాకోటి ప్రయోజనాల మాటున సాధించుకోగలగడం ఆ వర్గం ప్రజ్ఞకు సంబంధించిన విశేషం.

విద్య, ప్రభుత్వ ఉద్యోగాలు, సేద్యపు నీటి పారుదల సౌకర్యాలు, నదులమీద వంతెనలు, వ్యవసాయ, పారిశ్రామిక అభివృద్ధి మొదలైనవాటిల్లో ప్రాంతాల మధ్య పూరించడానికి వీలులేని అంతరాలను సృష్టిస్తాయి. దీనిని మేధావులు "This is a paradoxical situation and so more in the cantext of regional disparities, in the state of Andhra Pradesh. It is a cansequence of political manipulations and administrative intrigics..." (K. Jaya Shankar - (Fore Word) Flood Flow Canal (High level Canal) From S.R.S.P. Fore shone to Irriagate Upland and Drovuiht Prone Areas in Karimnagar, Waranagal and Nalgonda Districts of Telanuana Region - Prof - M.P. Raja Rao) అని విశ్లేషిస్తారు.

కవులు

''అడవిని పొత్తిళ్ళలో దాచి
పర్వతాలకు తలలు దువ్విన
నా దోసిళ్ళను కూడా తడపని
ఆ కృష్ణా గోదావరుల్ని దిగి రమ్మంటున్నా''.

అంటారు. '' ఇది తెలంగాణా - ఉద్విగ్న గీతాల నీటి వీణ'' అని కవిత్వమై పలుకుతారు.

తొలినుండీ తెలంగాణా కవులలో రెండు ప్రధానమైన దృక్పధాలు కనిపిస్తాయి.

1. రాజ్యానుకూల ప్రజానుకూల సామాజిక దృక్పధం

2. రాజ్యవ్యతిరేక ప్రజానుకూల రాజకీయ దృక్పధం ఈ రెంటి మధ్యనే తెలంగాణా కవిత్వం నడిచింది. ఈ దృక్పధాలను వాటి మధ్య అంతరాలలో ఉండే కవిత్వాన్ని ఏ కాలంలోనైనా చూడవచ్చు. అటు తెలంగాణా పోరాటంనుంచి మొదలుకొని ఇటీవలి దళిత కవిత్వం దాకా.

రాజ్యానుకూలం కావడం అంటే ఏమిటనే ప్రశ్న వస్తుంది. స్వాతంత్ర్యానంతరం వాటిల్లిన పరిణామాల వల్ల కవుల దృక్పధంలో ఒక మార్పు వచ్చింది. ఆ మార్పును సుప్రసన్న ఇలా గుర్తించారు.

''కవి స్వాతంత్ర్యం క్రమంగా ప్రభుత్వోత్సవాలకూ, ఆకాశవాణి మొదలైన సంస్థలకు ఒదిగిపోతూ వచ్చింది. బహుళ ప్రచారం పొందుతూ వచ్చిన పత్రికలు వారి యిష్టానిష్టాల మీద రచయితను నిలబెట్టడం, నిరాకరించడం చేస్తూ వచ్చాయి'' (సుప్రసన్న - వర్తమాన కవిత్వ దర్శనం (వ్యా) అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు పుట : 76) ఈ మాట తెలంగాణా ప్రాంతానికి చెందిన కవి, విమర్శకుడి నుండి రావటం గమనార్హం. కవి స్వాతంత్ర్యం ప్రభుత్వ సంస్థలకు వొదిగింది అంటే రాజ్యానుకూలం అయినట్లే. ఇదే అంశాన్ని మరొక కవీ, విమర్శకుడు తాను కవిత్వం మానేసినందుకు సంతోషాన్ని వ్యక్తం చేస్తూ చెప్పారు ''ప్రజాకవిని కాలేకపోయినా నా సమకాలికులు కొందరిలాగా ప్రభుత్వ కవిని అయ్యేవాణ్ణి కాదనుకుంటా'' (చేరా రెండు పదులపైన పుట:vi) అనడం ఈ అంశాన్ని సూచిస్తోంది.

ప్రజలు సాగించే పోరాటాలు ఏవైనా అవి తమ రాజ్యాధికారాన్ని ఎంతమేరకు ప్రశ్నిస్తున్నాయనే విషయం ఒక్కటే తప్ప పాలకులకి ఆ పోరాటాల కారణాలతో పెద్దగా నిమిత్తమేమీ ఉండదు. పాలకులకు నిమిత్తతలేనివి కవులకు నిమిత్తం అవుతాయి. ఈ దృష్ట్యానే తెలంగాణా ప్రాంత కవులు ఎక్కువ శాతం రా [illegible] టం.

''ఎన్ని శతాబ్దాలుగా - రాక్షసపాదం వాళ్ళని తొక్కిపెట్టిందో రాజ్యాధికారం అణిచివేసిందో'' ఇప్పుడు చరిత్రనే ప్రశ్నిస్తున్నారు.

చరిత్రా!

ఇవాళ్ళా నీ పుక్కిట్లో నిప్పునెట్లా దాచావ్
పిడికెడు బియ్యంలో గుమ్మడి కాయనెలా కప్పెట్టావ్' అని కవి అనడం రాజ్యవ్యతిరేకతలో భాగమే.

అయితే అవసరమైన సమయంలో అవసరమైనమేరకు రాజ్య వ్యతిరేకతను పైకి ప్రకటించలేని కవుల 'మౌనం' రాజ్యానికి అనుకూలించేదే అవుతుంది కనుక వీరి కవిత్వాన్ని రాజ్యానుకూల ప్రజానుకూల సామాజిక దృక్పథంగా భావించడం అసమంజసం కాదు. మొదటి దాన్లో రాజకీయాలతో ప్రమేయంలేని సామాజిక దృష్టి కోణం. మొదటిదాన్లో రాజకీయ దృష్టికోణం తప్ప మరేమి లేనిది. కవులకు అనివార్యంగా రాజకీయ దృక్పథం ఉండటం అవసరమా అని అడిగితే తెలంగాణా ప్రాంత సామాజిక, ఆర్థిక, సాంస్కృతి రాజకీయ పరిస్థితుల దృష్ట్యా అవసరమేనని భావించడంలో తప్పు లేదు. రాజ్యం పట్ల వ్యవహరించాల్సిన వైఖరి ఎట్లా ఉండాలనే ఒక్క విషయం దగ్గరే కవిత్వం, కవులు రెండు ప్రధాన వర్గాలుగా విడిపోతారు.

ఒక్కముక్కలో చెపితే తెలంగాణా కవులది ప్రజాస్వామిక మార్గం. దీన్లో రెండు పాయలు ఒకటి జాతీయ ప్రజాస్వామ్యం దీన్లో కవులు జాతీయ ప్రయోజనాలకు భంగకరం కాని విధంగానే భావాలను వ్యక్తం చేస్తారు. జాతీయత, ప్రజలు, ప్రజల ప్రాథమిక హక్కులు ఇవి తమ చైతన్య పరిధిని బట్టి పరిరక్షించే నిమిత్తం కవిత్వం రాస్తారు. ఈ మార్గానికి భిన్నమైంది 'పీపుల్స్ డెమోక్రసీ' ని విశ్వసించేది. ఈ అర్థ శతాబ్ది కవిత్వాన్ని పరిశీలిస్తే ఈ భిన్న మార్గాలు చాలా స్పష్టంగానే చూడవచ్చు.

(సమాప్తం)

– మానాపురం రాజాచంద్రశేఖర్

ఆధునిక కవిత్వం కొత్తరంగులను పులుముకుంటున్న ఈ రోజుల్లో వచన కవిత్వానికి ఒక ప్రముఖ స్థానముంది. మొదటిసారిగా ఈ ప్రయోగాన్ని ఆరంభించింది శ్రీశ్రీయే అయినప్పటికీ అతని ఛాయలు 'తిలక్ కవిత్వం' లో మనకు కనిపిస్తాయి. కనిపించడమేమిటి వినిపిస్తాయికూడా! ఈ ధోరణి మన హృదయాలను కదిలించేలా కవితాభిమానుల్ని పులకరింపజేసేలా ఉంటుంది తిలక్ కవిత్వం. ఈ ప్రయత్నంలో భాగమే తిలక్ రాసిన 'అమృతం కురిసిన రాత్రి'. ఇది ఇప్పటిది కాదు. సుమారు యాభైఏళ్ళనాటిది. అయినప్పటికీ అప్పటికీ ఇప్పటికీ చరిత్ర పాతదే. కొత్తసీసాలో పాతసారా పోసినట్టుగానే ఉంటుంది. ఈ సాహితీ వినీలాకాశంలో ఎప్పటికీ తీసిపోని పచ్చినిజం ఒకటుంది. అది మారే కాలపరిస్థితులతోపాటు నేటి కవిత్వ రచనా ధోరణులలో కొత్తశైలులు చోటు చేసుకుంటున్నాయన్న భావన. నేనిప్పుడు ప్రస్తావించబోయేది ఆ విషయం గురించే!

కవిత్వం గద్యంలో రాసినా పద్యంలో రాసినా వచనంలోరాసినా అది కవిత్వమే అవుతుంది. అదెప్పుడంటే అక్షరంలో అనుభూతి పలికినప్పుడు. వాక్యాలలో రసం ఒలికినప్పుడు చెప్పదలచుకున్న విషయాన్ని కవితగా చెప్పగలగడంలోనే కవియొక్క సృజనాత్మకత, నైపుణ్యం, ప్రతిభ ఆధారపడి ఉంటాయి. అలా నిర్భయంగా నిర్మొహమాటంగా చెప్పగలిగే వ్యక్తుల్లో మన తిలక్ ఒకడు. ఇతని పూర్తిపేరు దేవరకొండ బాల గంగాధర తిలక్. ఇతని కవితల్లో అభ్యుదయ వాదం, భావకవితా ఛాయలు, వచన కవిత్వం మనకు స్పష్టంగా అవగతమవుతాయి. ఇంకా నిశితంగా పరిశీలించినట్టయితే తిలక్ ఆలోచనా సరళిలో లోతైన అవగాహన ఉంది. సునిశిత పరిశీలనా దృక్పథం ఉంది. సమాజాన్ని లేవనెత్తే చైతన్యమూ ఉంది. అన్నింటికీ మించి ప్రపంచ చరిత్రను కాచి ఒడబోసిన అనుభవమూ ఉంది. నిత్య జీవితంలో ఎదురయ్యే కష్టనష్టాల తడి, ఆవేశమూ ఇతని రచనల్లో అడుగడుగునా ప్రతి బింబిస్తాయి.

నేటి యుగంలో చెట్టుకొకడూ, పుట్టకొకడూ చొప్పున చెల్లా చెదురవుతున్న ఈ తరుణంలో మనిషిమేధ శాస్త్ర సాంకేతిక రంగాలలో సాధించిన ప్రగతిని లోక కళ్యాణానికి ఉపయోగించకుండా, లోక వినాశనానికి దారితీసే విధ్వంస చర్యలకు పూనుకునే నేపథ్యాన్ని పెద్ద ఎత్తున నిరసించడం మనకు ఇతని కవిత్వంలో స్పష్టమవుతుంది. తిలక్ రచనాశైలి, భావవ్యక్తీకరణ, అభిప్రాయాలు విశేషప్రాధాన్యతను సంతరించుకున్నాయి. ఈ విషయాన్నే మరోసారి గట్టిగా నొక్కిచెబుతూ అతని ఆశయాలేమిటో, ఆలోచనలేమిటో, అనుభూతులేమిటో, అనుభవాలేమిటో తెలుసుకోవడానికి తిలక్ అంతరంగపు తలుపుతట్టి ఒకసారి లోనికి ప్రవేశించే ప్రయత్నం చేద్దాం.

లేఖల విషయంలో తిలక్‌ది అందెవేసిన చెయ్యి. ప్రధానంగా అతను రాసిన 'సైనికుడి ఉత్తరం' ప్రస్తావించుకోవచ్చు.

''ఇక్కడ నేను క్షేమం - అక్కడ నువ్వు కూడా
ముసలి అమ్మా, పాతమంచం కోడూ
మన చిన్నబ్బాయీ, చెరువులోకొంగా...'' ఇలా ఒకర్నేమిటీ, అందరి యోగక్షేమాలనీ గుచ్చిగుచ్చి మరీ అడిగి తెలుసుకుంటాడు తిలక్. ఇంకోచోట ఇలా అంటాడు:

''చలి గుండెల మీద కత్తిలా తెగింది.

నీ రూపం నా దేహానికి వెచ్చగా తగిలింది'' చలికి గజగజ వణికిపోతున్న సైనికుడికి చివర్లో అతని భార్య రూపంతో దేహానికి వెచ్చదనాన్ని కలిగించే ఘనత మన తిలక్‌కి మాత్రమే దక్కింది. తిలక్ లేఖలను బట్వాడాచేసే 'తపాలా బంట్రోతు' ని ఎలా చిత్రించాడో చూద్దాం. ఎండలో వానలో ఎండిన చివికిన ఆ చిన్నసైజు జీతగాడి కోసమై -

'' ఆ కిటికీలో రెండు విచ్చిన కలువల్లాంటి కళ్లు
ఆ వీధి మొగ్గవైపే ప్రసరిస్తోన్న చూపుల ముళ్లు
ఆ కళ్లళ్లో ఆతృత
ఆ గుండెల్లో గడచిన
దేశాంతర గతుడైన ప్రియుడి వార్తకోసం'' అలా ఎదురుచూస్తున్న ఆమెకి అతని అడుగుల సవ్వడి ఒక ఊరట.

''గుడిసెముందు కూర్చున్న పండు ముసలి అవ్వ
గడచిన బ్రతుకంతా కష్టపు నెత్తుటి కాల్వ
తానుకనిన తనప్రాణం, తనకు మిగిలిన ఒకే ఒక స్వప్నం
తనబాబు తన ఊపిరి'' అంటూ ఆందోళన పడే ముసలి అవ్వకి అతని చిరునవ్వు ఒక ఆసరా.

''దూరాల దారాల్ని విచిత్రంగా ఒకే నిముషము అనే
కండె చుట్టూ తిప్పగల నేర్పరి - కూర్పరి'' ఐన అతనిని -

'' ఒక్కనయనం కోటుదాటి లోపలకు చూడదు
ఉత్తరం యిచ్చి నిర్లిప్తుడిలాగ వెళ్లిపోయే అతణ్ణి చూసినపుడు
తీరంవదలి సముద్రంలోకి పోతూన్న ఏకాకి నౌకచప్పుడు''

అలా వెళ్లిపోతున్నవాడిని చూసి ''గాలిలేని ప్రకృతి యోగిలాగ, రోగిలాగ మూల్గుతోంది'' కాలం యొక్క కఠినత్వాన్నీ, క్రూరత్వాన్నీ ''పాముకోర డేగరెక్క ఈ కాలానికి చిహ్నం''గా అభివర్ణిస్తాడు తిలక్.

'కఠినోపనిషత్' కవితలో - '' నీడల కొండచిలువలు వెలుతురు కుందేళ్ళను మింగి, సంఘపు మర్రిచెట్టును చుట్టుకొని మత్తుగా నిద్రబోయే సమయాన, మానవారణ్యంలోని పెద్ద పులులు జరీకండువాలు, బిరుదాంకితమైన సువర్ణపతకాలు ధరించి, సిటీలో సభావేదికమీద కథాకళి నృత్యం చేస్తున్న కాలాన - అతడు పరీక్షనాళికలో ఎండిన నాగరికత గుండెని పరీక్షించి కొంచెంకొంచెం తన నెత్తురుతో తడిపి'' బ్రతికించే ప్రయత్నం చేసాడు. తిలక్ అపజయాన్ని సహించని వ్యక్తి. ఇక్కడ మెదడుకీ హృదయానికీ మధ్య పెరిగిపోతున్న దూరాన్ని సాంకేతికంగా పలికించాడు.

''శిఖరారోహణ' లో నుడివినట్లుగా - ''రైలింగ్ అవతల టిక్కెట్లు దొరక్క ప్రజలు దిగాలుపడి నుంచున్నారు. రేపటి ఉదయానికి వేసిన పట్టాల్ని ఎవరో తొలగించివేశారని'' చెప్పడంలో నేటి మధ్యతరగతి బ్రతుకులోని అస్తవ్యస్త పరిస్థితిని కళ్లకు కట్టించాడు.

'వెళ్లిపొండి వెళ్లిపొండి' శీర్షికలో - ''ఎవరు మీరంతా ఎందుకిలా వొంగిన నడుంతో కన్నీటితో చెదిరిన జుట్టుతో జారిన పైటలతో ఈ సమాధుల చుట్టూ వెదుక్కుంటూ తిరుగుతారు. తల్లులా, భార్యలా, అక్కాచెల్లెండ్రా, మీరు ఏనాటివారు, ఏవీటివారు, ఏయుద్ధంలో చనిపోయాడు మీవాడు, ఏదళం ఎన్నవనెంబరు, కురుక్షేత్రమైతే కృష్ణుణ్ణి అడగమంటాడు. పానిపట్టయితే పీష్వాలనడగమంటాడు. బొబ్బిలయితే బుస్సీని అడగమంటాడు. క్రిమియాయుద్ధం, కొరియా యుద్ధం, ప్రథమ, ద్వితీయ ప్రపంచయుద్ధాలను బిస్మార్క్, హిట్లర్లను అడగమంటూ, బ్రహ్మదేవుణ్ణికూడా అడగమనడం'' లో చాలా వ్యంగ్యం దాగివుంది. యుద్ధ విముఖతని కరుణ రసాత్మకంగా చిత్రించాడు.

'న్యూ సిలబస్' కవితలో - ''అమెరికాలో డాలర్లు పండును. ఇండియాలో సంతానం పండును. గజానికొక గాంధారికొడుకు గాంధీగారి దేశంలో. మాలిన్యం మనసులో ఉన్నా మల్లెపువ్వులా నవ్వడం ఈనాటి తెలివంటాడు'' తిలక్. ఇందుక్కారణమైన మాయతెరను పైకిలేవనెత్తి, నగ్నసత్యాన్ని వెలికితీసే బాధ్యతను తననెత్తిమీద వేసుకుంటాడు. అలా వేసుకోవడంవలన సమాజభారం తన భుజస్కంధాల మీదపడి దానిని ఋజుమార్గంలో నడిపించడానికి సరైన వీలుకలుగుతుంది. ఇలా సాగిన బాటలోనే 'భూలోకం' అనే కవిత తారసపడుతుంది. నిజానికి ఇందులో పేర్కొన్నట్లుగా ''ఆస్తిమూల పంజరాలు, ఆర్తరావ మందిరాలు, ఏ లోకం తల్లీ, ఏవో భాష్పజలాలు?'' అని అంటాడు తిలక్. దీనినే 'తనికెళ్ల భరణి' తన 'వీధి నాటకం'లో ఓ చోట ప్రయోగించడం జరిగింది. ఇది తిలక్ స్థాయిని తెలియజేస్తోంది.

కవి బాహ్యదృశ్యాలకు స్పందించి సృజనకు సంబంధించిన అంతర్దృష్టికి పదును పెట్టాలి. ఇది కవియొక్క ప్రధాన లక్షణం. దీనికి ఉదాహరణగా 'ఆర్తగీతం' అనే కవితను చెప్పవచ్చును. ''నేను చూశాను నిజంగా ఆకలితో అల్లాడి మర్రిచెట్టుకింద మరణించిన ముసలివాణ్ణి; నేను చూశాను నిజంగా నీరంధ్ర వర్షాన వంతెన కింద నిండు చూలాలు ప్రసవించి మూర్ఛిలిన దృశ్యాన్ని; నేను చూశాను నిజంగా తల్లిలేక తండ్రిలేక తిండిలేక ఏడుస్తూ ముంజేతుల కన్నులు తుడుచుకుంటూ మురికికాల్వ ప్రక్కనే నిద్రించిన మూడేళ్లపసిబాలుణ్ణి;'' అంటూ దయనీయంగా వర్ణిస్తాడు తిలక్. ఇతను బ్రతుకు తెరువులోని సాధక బాధలను ఎరిగినవాడు కనుకనే కవిత్వాన్ని అందంగా అర్థవంతంగా రాయగలిగాడు. దేశస్థితిగతులను అనుభవం త్రాసులో తూసి బేరీజు వేయగలిగాడు.

'ప్రార్థన' కవితలో ''దేవుడారక్షించు నా దేశాన్ని, పతివ్రతల నుండి, పెద్దపులుల నుండి, పెద్దమనుషులనుండి'' అని తనగోడును వెళ్లబుచ్చుతూ ''మంచి గంధంలాగ పరిమళించే మానవత్వం మాకున్న ఒకే ఒక అలంకారం'' అని చెబుతాడు. తిలక్ సామాన్యుని జీవితం పట్ల స్పందించాడు. మంచితనం, అనురాగం, మానవత్వం, సౌందర్యం, సుఖం, చైతన్యం, కరుణ ఆయన ఆశించిన విలువలుగా చెప్పుకోవచ్చును. అంతేకాదు తిలక్ అనుభూతివాది. ''భూమధ్యరేఖ నా గుండెలోంచి పోతోంది. భ్రుకుటిలోపల నక్షత్రగోళం తిరుగుతోంది. ఈ వేళ నన్నానవాలు పట్టలేవు నువ్వు. సూర్యుడిని చూడు నా తలమీద పువ్వు'' అని అంటాడు తిలక్. ఇందులో అతను ఎంత ఎత్తుకి ఎదిగిపోయాడో మనకర్థమవుతోంది. అలా ఉన్నత శిఖరాలను అధిరోహిస్తూనే మానవ జీవితంలోని ఎత్తుపల్లాల జాడను కనుక్కుంటాడు. ''ఎగుడూదిగుడూ పెళ్ళాంమొగుడూ, వీరికి ప్రణయం, మనకేప్రళయం'' అంటూ చిన్న హాస్యపుజల్లు విసురుతాడు తిలక్.

కలం ఎలా దూసుకెళ్తే అలా తరలివచ్చే కవిత్వం రాసేవాడు కవికాదు. తన ఆలోచనల్తో ఊహకు పదునుపెట్టి రాసేవాడు నిజమైన కవి. ఆ పదును తిలక్ కవితలో కూడా మనకు ప్రస్ఫుటమవుతుంది. ''ప్రతిరక్తకణంలో ఒక వాంఛా చీలిక, ప్రతి మనోంగణంలో ఒక సృష్టి దీపిక.'' ఇదిలా కొనసాగడంలోని ఆంతర్యం కవి తనమనోనేత్రంతో అంతర్మథనం చేయగల సత్తాను కలిగివుండడమే! ''అగ్నిచల్లినా అమృతం కురిసినా, అందం ఆనందం దాని పరమావధి '' అన్న చరణాల్లో కవిత్వం గురించి తిలక్‌కి ఉన్న అవగాహన స్పష్టంగా వెల్లడవుతోంది.

తిలక్‌లో మంచి భావుకత ఉంది. ఉత్తమ కవిత్వం రాయగలిగే లక్షణాలు పుణికి పుచ్చుకున్నట్లు మనకు కనిపిస్తాయి. 'అమృతం కురిసిన రాత్రి'లో ''అందరూ నిద్రపోతున్నారు. నేను మాత్రం తలుపు తెరిచి - యిల్లు విడిచి, ఎక్కడికో దూరంగా కొండదాటి కోనదాటి వెన్నెల మైదానంలోకి వెళ్ళి నిల్చున్నాను.'' ''జలజలమని కురిసింది వాన, జాల్వారింది అమృతపుసోన, దోసిళ్లతో తాగి తిరిగివచ్చాను. చావునీ దుఃఖాన్నీ వెళ్ళిపొమ్మన్నాను'' అని అమృతపు జల్లుపై వివరణయిచ్చి, దుఃఖాన్నీ మరణాన్నీ ధిక్కరించే ప్రయత్నంలో అసలు రహస్యాన్ని బయటపెడతాడు. ''అందుకే పాపం ఈనాటికీ తెలియదు. నేను అమరుడనని'' చెప్పుకుంటూ అటు కవితకూ, ఇటు తన జీవితానికీ మధ్య వారధిగా ముగింపునిస్తాడు తిలక్!

*Continued Page No. 53*

foreign policy reform, domestic policy reform, defence reform..." "And," called out a bored voice in the audience, "chloroform!"

Irwin S Cobb once attended a testimonial dinner during which his patience grew thin under the assault of several boring long-winded harangues. When he was called on for his contribution, he prefaced his very brief remarks with: "You have just heard several famous Chinese philosophers, all nemed On Too Long."

The late Dr Edward Israel was booked to deliver a lecture in the city auditorium in a town in Virginia. The chairman expressed his elation over the presence of such a distinguished speaker by saying that he possessed the quality of the initials of Yale, the chairman's alma mater. The Y stood for youth, the A for ambition, the L for loyalty and the E for enthusiasm. "Although the speaker is not a graduate of Yale, his life mirrors all these noble characteristics" said the chairman, after taking an hour to explain the four points.

When Dr Israel rose to speak, he thanked the chjairman profusely. "However." he said, "I am sure all of us are grateful that the chairman is not a graduate of the Massachusetts Institute of Technology."

# అన్నా ఫ్రాయిడ్

– శివలింగం

సింగ్మండ్, మార్తా ఫ్రాయిడ్‌లకు ఆరుగురు సంతానంలో చివరిది అన్నా ఫ్రాయిడ్. మానసిక విశ్లేషణ వృత్తిగా స్వీకరించింది. వియన్నాలో 1895 డిశంబరు 3న పుట్టింది. అన్నా ఫ్రాయిడ్ 86 ఏళ్లు నిండు జీవితం అనుభవించి 1982 అక్టోబరు 9న లండనులో మరణించింది. పిల్లల మనస్తత్వ శాస్త్రవేత్తగా విశేషకృషి చేసింది. అనేక పుస్తకాలు 100 వ్యాసాలు రాసింది. మనస్తత్వ శాస్త్రీయ రంగంలో పనిచేసిన వారికి తెలుసుగాని బయట అంతగా తెలియదు. ప్రచారం అంటే గిట్టదు. టెలివిజన్‌లో కనబడటం యిష్టం లేదు. ఉన్నత విద్య లేకపోయినా గౌరవ డాక్టరేట్‌లు సంపాదించింది. డాలి మాడిసన్ అవార్డు వైట్ హౌస్ ఏర్పాటు చేసిన సమావేశంలో స్వీకరించింది. తల్లి పాలుగాని, నర్సుపాలుగాని తాగలేదు. తల్లికన్నా నర్సు ప్రేమ, భద్రతలో పెరిగింది. ఆమె మాటల్లో చెప్పాలంటే నర్సు ఆమెకు ప్రైమరీ కేర్ టేకర్, సైకలాజికల్ మదర్, ఫ్రాయిడ్ చివరి పదహారు సంవత్సరాల జీవితం కష్టకాలం. నోటి కేన్సర్‌తో బాధపడ్డాడు, చుట్టలు విపరీతంగా కాల్చడం వల్ల వచ్చింది. అన్నామీద ఆధారపడ్డాడు ఫ్రాయిడ్. అన్నా పెళ్ళి చేసుకోలేదు. ఫ్రాయిడ్ రచనలను పవిత్రంగా భావించింది.

ఎలిమెంటరీ స్కూలు టీచరుగా శిక్షణ పొందింది. తండ్రి కనుగొన్న సైకో ఎనాలిసిస్‌ను వృత్తిగా చేపట్టింది. ఫ్రాయిడ్ తరవాత పిల్లల మనస్తత్వాన్ని గురించి రాసిన వారిలో అన్నాకి వచ్చిన గౌరవం, కీర్తి, ప్రతిష్టలు ఎవ్వరికీ రాలేదు.

1938లో హిట్లర్ ఆస్ట్రియాను ఆక్రమించాడు. ఫ్రాయిడ్ యూదుగావడం వలన జీవితానికి హిట్లర్ వల్ల ఏర్పడిన ప్రమాదంతో వియన్నా వదలి అజ్ఞాతంగా పారిపోయాడు. ఫ్రాయిడ్ రచనలన్నీ తగలబెట్టారు. బ్యాంకు ఎకౌంటు జప్తు చేశారు. 1938లో ఫ్రాయిడ్ యింటిని రెండుసార్లు నాజీలు సోదా చేశారు. 1938 మార్చి 22న అన్నాను తీసుకువెళ్ళి సైకో ఎనలిటిక్ ప్రచురణలు గురించి ప్రశ్నించారు. సాయంత్రం ఏడుగంటలకు తిరిగి యింటికి వచ్చినపుడు ఫ్రాయిడ్ వియన్నావదలి వెళ్ళిపోదామని వేదనతో చెప్పాడు. అదృష్టవశాత్తు అమెరికన్ దౌత్యవేత్తలు, మిత్రులు మేరీ బోన పార్టీ, ఎర్నెస్టు జోన్సుల సహాయంతో జూన్ 1938న అన్నా, ఆమె తల్లిదండ్రులు ఆస్ట్రియా వదలి ఇంగ్లండు చేరారు. నయంకాని కేన్సర్ భాధ వల్ల ఫ్రాయిడ్ మరణ ప్రసాదాన్ని ( యుథినేషియా ) కోరాడు. 23 సెప్టెంబరు 1939న హాంప్‌స్టెడ్ లండన్‌లో మరణించాడు. అన్నా నలుగురు సోదరిలు కాన్సెంట్రేషన్ క్యాంపుల్లో నాజీలు చంపేశారన్న విషాదవార్త వినకుండా ఫ్రాయిడ్ వెళ్ళిపోయాడు.

తండ్రి లాగ మౌలిక చింతనా పరురాలు (original thinker) కాదు. పిల్లల మనస్తత్వ విశ్లేషణ సిద్ధాంతానికి ఆమె యోగదానం గొప్పది. స్త్రీ పుంసత్వాల మధ్య సంఘర్షణగా కనిపిస్తుంది ఆమె జీవితం. ఈ ఘర్షణను అన్నా రాసిన ఒక ఉత్తరంలో పేర్కొన్న శిశ్నశిశువు. (Penischild) ప్రతిబింబిస్తుంది. Asyou know, I am addicted to pencils and can never have enough. ఫ్రాయిడ్‌కు అనాటమి గమ్యం. అన్నా పురుషత్వాన్నే గమ్యంగా ఎంచుకుంది.

అమెరికా మనస్తత్వ శాస్త్రవేత్త కూతురు అయిదేళ్ళ పాప అన్నా గౌను పట్టుకుని 'నీకెంత మంది పిల్లలు' అని అడిగింది. అవివాహిత అన్నా మోకాళ్ళమీద నిలబడి పాపను పట్టుకొకని 'చాలా చాలా మంది పిల్లలు' అన్నదట.

అన్నా ఫ్రాయిడ్ రచనలు 1966-80లలో 8 సంపుటాలుగా ప్రచురించారు. విడాకులు పొందిన దంపతుల సంతాన సంరక్షణ గురించి అన్నా మంచి విశ్లేషణ చేశారు. అన్నా ఫ్రాయిడ్ తండ్రికి తగ్గ తనయ.



ఆలోచన
చిత్రకారుడు : పైడిరాజు

